# నా
# లెక్షను అనుభవము.



టరత్నం
యద్దనపూడి వెల్లగూ డెం. న్మా

# పరిచయము.

నాకు పరిచితుఁడు శ్రీయుతుడు యద్దనపూడి వేంకట రత్నం పంతులు "నా ఎలెక్షన్ అనుభవము" అని వ్రాసిన ఈ పొత్తమును తెలుఁగువారికిఁ బరిచయము చేయు భాగ్యము నా కొదవినది. వాఙ్మయమున వెలువడు గ్రంథములలో తాత్కాలికములు కొన్ని ; తరతరములకు నిలుచునవి కొన్ని. వేంకటరత్నముగారి వ్రాసిన పుస్తకము లిట్టివి చిరకాలము నిలిచియుండెడివి. "నా యనుభవ" మనుట నిమిత్తమాత్ర నామకరణము. లౌకికమున నడుగిడెడు ప్రతి ప్రాణియు సమన్వయించుకొనఁదగిన ప్రసన్నములగు ననుభవములు పెక్కులిందుగలవు. లోకల్ బోర్డు యెలక్షను ఊంపిఁ జొర నుండు వాఁడు ఈ పుస్తకము నొక్కమాఱు పారాయణచేయునేని వివిధములగు చిత్తవృత్తులు బోధపడగలవు. అందుచేఁ దన ప్రచారమున మెలఁకువ యావశ్యక మని తోఁపఁగలదు. జడ మతికి శంకరుని "మనీషాపంచకము" వోలె, నీ గ్రంథము లౌకికతంత్రములఁ బొరలు జీవికి మేలుకొలుపుగా నుపకరించు నని నమ్మఁ దగును.

ఏలూరు,<br>15–12–1932.

—మున్నంగి లక్ష్మీనరసింహాశర్మ,<br>"దేవసత్తమ్."

# సవరణపట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 2 | నడిపే | నడిపేది |
| 1 | 3 | శ | శ్య |
| 3 | 10 | కే | కి |
| 6 | 15 | తాత్కాలకముగా | తాత్కాలికముగా |
| 10 | 15 | సూబ్బారావు | సుబ్బారావు |
| 11 | 9 | యిస్తావన్నాము | యిస్తామన్నాము |
| 16 | 14 | ఇదేమిటన్నారా | ఇదేమిటన్నారు |
| 17 | 11 | కడియం | కడియద్ద |
| 23 | 6 | పరిచారం | ప్రబోధం |
| 26 | 8 | తిరికి | తిరిగి |
| | 20 | సావకాశంగాని | సావకాశంలేని |
| 27 | 2 | కిస్తరివేస్తే | విస్తరివేస్తే |
| 29 | 7 | విశరపర్చు | విశదపర్చు |
| | 13 | కూచము | కుంచము |
| | 16 | బండితోనే | బండితోతే |
| | 21 | పట్టుంపాలెం | పట్టెంపాలెం |
| 35 | 6 | అమలులోనిదే | అమలులోని కిదే |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 36 | 8 | మీారా | కూడా |
| | | కలియ | రా |
| 40 | 10 | సాయ | సాలు |
| 45 | 3 | ఆలోన | ఆలోచన |
| 47 | 12 | ప్రతి | పులి |
| 53 | 12 | పుట్ల | పుట్ట |
| 59 | 15 | ల్డుకవరులో | సీల్డుకవరులో |
| 62 | 6 | వెళ్లి | వెళ్ళి |
| 70 | 2 | పురవానము | వుపవాసము |
| 72 | 13 | ఎదిరి | ఆదిని |
| 80 | 22 | అశిస్టెంటు తర్వాత 5 వ పంక్తి: "వుండవలెను" అనుదానినిచేర్చి చదవలెను. | |
| 83 | 20 | వాటమగు | న్యాయమగు |
| 87 | 7 | కర్హ్వతగల | కోద్ధుతగల |
| 91 | 1 | యశ్లోతను | యశోలతను |

# విషయసూచిక.



యెద్దనపూడి వెంకటరత్నం,

తాడేపల్లిగూడెం.

# నా

# ఎలెక్షను అనుభవము.

నా పేరు యద్దనపూడి వెంకటరత్నం. నా నివాసస్థానము-తాడేపల్లిగూడెం. జన్మచేత బ్రాహ్మణుడనే కాని, నడిచేది వైశవృత్తి. నా వయస్సు రమారమీ నలభైసంవత్సరములు. నేను చేసే వ్యాపారం లాభించేదే గాని, నష్టం వచ్చేది కాదు. అనుభవించవలసిన భోగభాగ్యా లనుభవించాను. పడవలసిన కష్టాలన్నీ పడ్డాను. అవసరమగునంత లోకజ్ఞాన మలవరుచుకున్నాను. నేను సముపార్జించిన అనుభవజ్ఞానములోని కొన్ని కొన్ని విషయములను, ప్రత్యేక ప్రత్యేకముగా అచ్చొత్తింపించి, ప్రజాసముదాయమునకు అందజేశాను. అవి అన్నియు మన్ననల నందినవి. ఏ తన్మూలమున యింకను యెక్కువగా అనుభవజ్ఞానమును సంపాదించి, యింకను అనేకవిషయములను గ్రంథస్థములు గావించి, నే నేప్రజలమధ్యనుండి, నా జీవితమును ధన్యతమము గావింప నభిలషించితినో, వారికి యీవిధముగా సేవ జేయదలంచితిని. ఇట్టి తలంపు నాహృదయమునందు నాటుకొనిన సమయములో, ఈ జిల్లాలో స్థానికసంస్థలయెన్నికలు సమీపించినవి. ఇంతవరకు, నా కుటుంబము, నా

కుటుంబమునకు సంబంధించిన యితరబంధువుల సేవ జేయు టయే కర్తవ్య మనే బాధ్యతపెట్టుకున్నాను. హృదయము విశాలమగుటతోడనే సేవ జేయదలచిన బాధ్యతను పొడు గింప నెంచితిని. స్థానికసంస్థల యెన్నికలు సమీపించినంతనే, అదను దొరికినది గదా అని సంతోషించి, 'నిలబడడమా ? మానడమా ?' అనే డోలాయమానంలోనికి దిగింది మనస్సు.

ఈ కథ యిట్లుండగా, నా వ్యాపార సౌకర్యముకొరకు తాడేపల్లిగూడెంగ్రామంలో రెండు కొట్లు కట్టించి నాను. కొట్లు నావే కాని, అవి కట్టిన స్థలం నాది కాదు. లేదా స్థలకలవారికి నేను కొంతడబ్బియ్యవలసివచ్చింది. వారి డబ్బు వారి కిచ్చివేయమన్నారు. స్థలం ఖరీదు కివ్వండి. కొట్లు ఖరీదుకట్టి పుచ్చుకోండి, అదిపోను యేమైనా యివ్వవలసివుంటే యిస్తా నన్నాను. మాకు కొట్లు వద్దు. స్థలం మేము యివ్వము. మాడబ్బు మాకు యివ్వ మన్నారు. స్థలం ఖరీదుకు యిస్తారనే వుద్దేశముతో మీదగ్గిర తెచ్చిన ద్రవ్యము కొట్లకై వినియోగించినాను. మీరు పుచ్చుకోని యెడల వాటిని పీక్కొని పోవలసి వుంటుంది; అందువలన నాకు చాల నష్టం వస్తుంది. కాబట్టి కొట్లు ఖరీదు కట్టి తీసుకుంటేనేకాని, బాకీ యివ్వ నన్నాను-దానిపైన వారు దావా చేసినారు. దానిలో మేము వుభయులము రాజీపడినాము. ఆరాజీనామా షరతుల ప్రకారము, సదరు రెండుకొట్లున్నూ ఖరీదుకు ఖండించి

పుచ్చుకొనుటకును, అందులో ఒక కొట్టున్ను, దానికి చేరి యున్న అరుగున్ను, వెనుకవైపున వున్న దొడ్డిన్ని నాకు అద్దెకు యిచ్చుటకు యేర్పాటు. ఆ ప్రకారము ఒక కొట్టు నా స్వాధీనములో నున్నది. ఈ కొట్టుకు చేరియున్న అరుగు ఆక్రమణ అనిన్ని తీసివేయకపోతే ప్రాశిక్యూషను చేస్తామని జిల్లాబోర్డు వారు నాపైన నోటీసు జారీచేసినారు.

దానిని తీసుకొని వెంటనే మాఫిర్కాకు నియుక్తులై యున్న జిల్లాబోర్డుమెంబరుగారిని సమీపించి, అయ్యా, యీ కొట్లు నేను విక్రయించి వేసినాను. ఆసంగతి తమకున్ను విశదమే. ఇప్పుడు నా కేవిధముగా నోటీసు వచ్చినది. యేమి చేయవలసి వుంటుం దని అడిగినాను. దాని పైన వారేమి చెప్పారనగా: ఆసంగతులతోనే అర్జీ వ్రాసి, దానితో రాజీ నామాడిక్రియొక్క పబ్లీకునకలును జతపరిచి, జిల్లాబోర్డు ప్రెశిడెంటుగారికి పంపుకుంటే దానిపైన, నేను సంగతులు స్పష్టపరచి, మీామీాద కేసు లేకుండా చేస్తామన్నారు. నేనున్ను ఆప్రకారం అర్జీవ్రాసి, దానికి వారు చెప్పిన విధముగా రాజీ నామా డిక్రి జతపర్చి జిల్లాబోర్డు ప్రెశిడెంటుగారికి అందజేసే నిమిత్తం నామీాద నోటీసు అమలు జరిపిన వారికేయిచ్చినాను.

ఈ లోపుగా యం. యల్. సి. బైయెలెక్షను సమీాపించినది. దానికి పెద్దిరాజుగారు, బడేటి వెంకట్రామయ్య నాయుడుగారున్ను తీవ్రముగా పోటీచేయ మొదలుపెట్టినారు.

నేను తరుచు పత్రికలలో వ్యాసములు వ్రాస్తూయుంటాను. మంచిని నిరూపించి, చెడుగును ప్రత్యేకించి నిరూపించ ప్రయత్నించడమే నావ్యాసముల పుద్దేశము. నేను వ్రాయు వ్యాసములన్నియు న్యాయాన్యాయములను నిష్కర్షగా విమర్శించునవే. అందువలననే నేను వ్రాయు వ్యాసములకు తెలుగు మాట్లాడు జిల్లాలలో ఒకవిధమగు పరపతికల దని, నాహితము కోరిన మిత్రులు కొందరు అప్పుడప్పుడు నాయెదుట అనుటకలదు.

సాధారణముగా యెలక్షనులలో మెంబర్లుగా నిలువబడదలచినవారు, పత్రికలలో వ్యాసములు వ్రాయు వారలను, పత్రికాధిపతులను, వోటర్లను సమకూర్చే బ్రోకర్లను, బుజ్జగించడమో, లంచమిచ్చి కొనుక్కొనడమో, అధికారము చేత అదుపులో నుంచడమో, ఏదైనా ఒక అవసరము కల్పించి, అడకత్తెరలో బెట్టి, నొక్కివుంచడమో, రివాజు. పత్రికలలో వ్యాసములు వ్రాయుటయందు నాకుగల నేర్పరితనమునుబట్టి, నావ్రాతలవలన తమకేమైన వ్యతిరేకప్రచారము జరుగునను భయముచేతనో, మరియేయితర కారణంచేతనో నన్నదుపులోనుంచ దలచి, యిదియొక సావకాశముగాతీసుకొని, తాను దగ్గిరవుండి స్వయముగా మాట్లాడి, నా మీద కేసు తీసివేయిస్తానని నమ్మబలికిన జిల్లాబోర్డు మెంబరు, నామీద

కేసుపెట్టుట ప్రస్తుతంలో అవసరమని నచ్చజెప్పి, ప్రాశిక్యూషను చేయవలసిన దని జిల్లాబోర్డు మీటింగులో రిజల్యూషను ప్యాసుచేయించి ఇంటికి వచ్చి యీసంగతి నాతో చెప్పినాడు. తర్వాత స్టేషనరీసబ్ మేజస్ట్రీటు కోర్టులో నామీద కేసుపెట్టినారు. నేను అర్జీలో వ్రాశిన విధముగానే అనగా, కొట్లు నేను అమ్మివేశినా ననిన్నీ, కొట్లఖామందులనే జవాబుదారీ చేయవలసిన దనిన్నీ, ఒకవేళ నన్ను, నివశించువాడుoccupierగా భావించినను, నేను అద్దెకు వుంచుకున్న కొట్టునకు యెదురుగా వుండే అరుగునకు సంబంధించినంత వరకే నన్ను బాధ్యునిగా జేయవలెనుగాని, రెండుకొట్లకు యెదురుగా వుండే అరుగున కంతకు నన్నే నేరస్థునిగా జేయుట న్యాయము కాదనే మొదలైన సంగతులతో డిఫెన్సు పెట్టినాను. యం. యల్. సి యెలక్షను అయినదాకా కేసు వాయిదా పడినది. తర్వాత నామీద పెట్టినకేసు తీసివేసుకున్నారు. నామీద కేసు పెట్టి తిరిగి తీసివేసుకోవడము సందర్భము చూడగా నన్నీవిధముగా కొన్ని ప్రత్యేకకారణములను బట్టి యిబ్బందికట్టుబాట్లలో నుంచవలసి వచ్చినదని అనుమానపడవలసి వచ్చినది.

నావంటివాని పైననే, నిర్హేతుకముగా ఒకకేసు కల్పించినాలే! ఇట్టి అన్యాయము లెన్నిపెట్టి, విద్యాగంధము లేని పామరులగు ప్రజల తమ అధికారమును దుర్వినియోగము

చేసి బాధపెట్టుచున్నారోగదా! అని మనస్సు పరిపరి విధముల వేధింపసాగినది. ఇంతలోనే వెంకట్రామన్న గూడెం మొఖాసాదారులగు వెలమదొరలు, ఒక నోటీసు యిటువంటి దానినే వెంటబెట్టుకొనివచ్చి, ఇంగ్లీషులో వున్న దానిని తెలుగు తర్జుమా చేయమని నన్ను కోరగా చదివి చూచితిని. దానికథకూడ నాదాని వంటిదే. వెంకట్రామన్న గూడెం వెలమవారంటే నిగర్వచూడామణులని ప్రతీతి. ఇతరులసొత్తును వారపేక్షింపరు. తమకు గలదాని దుర్వ్యయము గాని అపాత్ర దానముగాని చేయరు. తమరు నొవ్వరు. ఇతరులను నొప్పించే యేపనియును చెయ్యరు. వారి పొలము రోడ్డు కిరుప్రక్కలను వున్నది. రోడ్డుమార్జినులో అడ్డుగట్లువేసి, పొలములోనికి పెంట తోలుకొనుట చిరకాలము నుండి ఆచారము. అట్లు బండ్లరాకపోకల సౌకర్యము కొఱకు టెంపొరరీగా వేయబడిన గట్లు ఆక్రమణలని నోటీసు. స్థలంవారి దనటంలేదు. తాత్కాలికముగా వేశినగట్లు, వాటంతటవి వర్షము రావడముతోనే కొట్టుకొని పోవడం సహజము. ఇట్టిదానికి ఆక్రమణనోటీసు యివ్వడములో అంతరార్థముండక పోదని అనుమానపడుటకు అవకాశం వుండదని అనుకొంరు.

దీనితో, అధికర్తలో ప్రమాదవశాత్తు అనే అభిప్రాయము పోయి యిట్టిచర్యలన్నియు అంతరార్థములతో యిమిడి యుండునని ధ్రువపడినది.

తొలుత స్థానికసంస్థలలో అభ్యర్థిగా నిల్చుటయా, నిలువకుండుటయా అనే సందేహము సమసిపోయి, తప్పకుండా నిలువబడవలెననే నిశ్చితమునకు వచ్చితిని.

అటుతర్వాత నేను చేసిన ప్రయత్నము.

ఈ నా అభిప్రాయమును నా కనిష్ఠ సోదరునికి చెప్పి నీ అభిప్రాయమేమిటిఅని అడిగితిని. గంగరాజుగారి అభిప్రాయమునకు వ్యతిరేకముగా నడువవీలు లేదు. కాబట్టి ఆయనతో మనవి చేయుమని సలహాయిచ్చినాడు. ఆయన వుద్దేశములో వేరొకమనిషి యున్నాడుగదా? నే నిప్పుడు వెళ్లి అడిగితే, నీవుపంపించినట్లు అభిప్రాయపడితే నీకేమిచెడదుగదా? అని అన్నాను. నాకు యేమీచెడేదిలేదు. నీవుచేసేది వ్యాపారం. మిల్లులతో సంబంధం. పిల్లలుగలవాడవు. నీవే బాగా ఆలోచించుకో మన్నాడు. సరేనంటే సరే అన్నాను. అన్నిటికి దైవమేవున్నాడు కదా అనుకున్నాను. వెంటనే వెళ్ళిమనవి చేశాను. సరే నామినేషనుల తేది నిర్ధారణకానీ చూతామన్నారు.

అటు పిమ్మట నా అభిప్రాయమును ఆంధ్రపత్రిక ద్వారా బహిరంగపరచితిని. (దానిని వెనుకభాగమందు No 1 గా చూడనగును.) నాహితము కోరిన పెద్దలు నా అభ్యర్థిత్వమును బలపరుస్తూ పత్రికాముఖమున తమ అభి

ప్రాయములను వెలువరించినారు. (No 2). అటుపిమ్మట నా విజ్ఞప్తి ఆంధ్రపత్రికలో ప్రచురింపించితిని (No 3). అంతటితో తనివి నందక, గ్రామముల వారిగా, పెద్దలను నాయకులను కల్సుకొని, నాతత్వ మేమిటో, నే నెందుకు యిందులో జేర నుద్దేశించితినో దానిని వారికి చెప్పి, ఆవిధముగా వారిచేతనొక వ్రాత వ్రాయించుకొని, నామకులైనవారలచేత సంత కములు చేయించుకొనుటయే గాక, కొంతమందిచేత వాగ్దాన ములుకూడా చేయించుకొన్నాను. అందరూ నే నభ్యర్థిగా నుండుట కర్హుడ నని ఆశీర్వదించుటచేత, ఆమోదము తెలుపుట చేతను, తీరా దిగినతర్వాత, వీడికీ మెంబరీయేనా? అంటా రేమో అనే పిరికితనము వదలినది. నేనెన్నడూ తిరుగనిగ్రామ ములు చూచుటయును, నన్నెన్నడు చూడని ప్రజలకు నాతో పరిచయము గలుగుటయు తటస్థించినది.

ఈ సందర్భములో వోటర్ల జాపితాలనుగురించి కొంచెం చెప్పవలసియున్నది. చదువరులు సీతమ్మసోదిగా భావింపక యించుక లక్ష్యముంచి చదువ కోరినాను. ఈ యెలక్షనుకు, గవర్నమెంటువారు తయారుచేసిన వోటర్ల జాపితాలు వున్నవి వున్నట్లుంచలేదు. వున్న పేర్లు తీసివేయడం, లేనిపేర్లు చేర్చడం తరుచుకలిగింది. ప్రమాదవశాత్తు విడిచిపెట్టబడిన పేర్లుగాక, బుద్ధిపూర్వకముగా చేర్చజూచిన పేర్లసంఖ్య పెచ్చుపెరుగ జొచ్చినది. ఈగందరగోళములో న్యాయమగు అర్హతగల

వారిపేరు లేకపోవుటయు, అర్హతలేనివాని పేరుచేర్చబడు యోగ్యత కలుగుటయు తటస్థించినది. ఈతంతులన్ని కన్పెట్టు చున్న కొందరు, తాముకూడా అభ్యర్థులుగా నిలువవలెననే అభిలాష కలిగియుండియు, అభిప్రాయము వెల్లడించితే, జాపి తాలోనుంచి పేరుతీసివేయబడుతుందేమో అనే భయముచేత నక్కి-నక్కి చాటునమాటున తమతమ ప్రచారములు సాగిస్తూ యుండేవారు. కాని బహిరంగముగా తన అభ్యర్థిత్వముకొఱకు ప్రచారంచేశి, పేరుపోగొట్టుకొని భంగపడ్డవాళ్లలో చోడవరం కాపురస్థులున్నూ సాలుగుజస్తా తాలూకా అందు జిల్లాబోర్డు మెంబరుగారయిన ఆలపాటి సుబ్బన్నచౌదరీగారొకరు.

ఈయనపేరు పోయిందనిన్ని, ననగ్రామం తాలూకున్నూ, తన తరఫు మరికొందరి గ్రామాదులలోని పేర్లున్నూ తీసివేయబడినవని వదంతి బయలుదేరటంతోనే, వాటి సవరణ నిమిత్తం పెద్దిరాజుగారు అనుచరులైన కలిదిండి గంగ రాజుగారిని వెంటబెట్టుకొని మద్రాసు బయలుదేరినారు. తత్సంబంధమగు మార్పులు అన్ని చేయించగలిగినారుగాని ఆలపాటి సుబ్బన్నగారిపేరు అసలు ఆఫీసరుగారిచేతనే కొట్టి వేయబడుటవలన, తిరిగి చేర్పించుట సుసాధ్యము కాకపోయి నది. పిడుగువంటి యీవార్త విని, పిడికిటితో గుండెలు పట్టు కొని, గంగరాజుగారు మద్రాసుమెయిలులో దిగినారు. చౌదరీగా రెదురుపడి నామా లేమయినదని నదురుతూ బెద

రుతూ అడిగితే తిరిగి చేర్చడము సాగలేదుగాని హైకోటుకైంది కాదా అడ్డపడడాని కని ధైర్యంచెప్పారు. చౌదరీగారు మద్రాసు బయలుదేరి, వ్యయప్రయాసలకులోనై విశ్వప్రయత్నం చేశారు గాని మాట దక్కలేదు

ఈసంగతి నాకు తెలిసి, యిప్పుడైనా నాకు సహాయము చేయవలసినదని గంగరాజుగారిని నేను తిరిగి ప్రార్థించినాను. ఆయనప్పటికుండే స్థితిలోనికి తీసుకొని వచ్చినవారి చేత చెప్పించినాను. ఆప్తులు సలహా యిచ్చినారు. హంగుదార్లు నచ్చజెప్పారు. హితులు హితబోధ చేసారు. వల్లకాదనలేదు. పూర్తిగా ఆమోదించిన ట్లగుపించనూలేదు.

ఇంతట్లో ఆలపాటిసుబ్బన్నచౌదరీగారు యెచ్చటినుంచో వచ్చారు. గంగరాజుగారి యింట్లో దిగారు. యేమిమాట్లాడుకున్నారో యేమిటో, వెంటనే కారు తెప్పించమన్నారు. జబ్బుపడి నీరసంగావున్న గంగరాజుగారిని కారెక్కించి, యద్దనపూడి సూబ్బారావు తుమ్మలపల్లి కామరాజుగార్లను వెంటబెట్టుకొని, చౌదరీగా రేమి మంత్రాంగంచేశారో యేమిటోరెడ్డిసీమవైపునకు దారితీసారు. తిన్నగా ప్రకాశరావుపాలెంలో దిగారు. గ్రామపెత్తందారుగారైన దేవిన సోమన్నగారిని కల్సుకొన్నారు. మాట్లాడవలసిన మాటలు మాట్లాడినారు గాని, ఆలపాటి సుబ్బన్నగారు చాటుకు తీసుకొనివెళ్ళి చెవిలోయేదోవూదారు. దానితో, అదివరకు తాలూకా బోర్డుకు నేను వుండను అన్న

వాడు, తటాలున అనంతపల్లిసర్కిలులో తాలూకాబోర్డుకు వుండవలెనసే అభిప్రాయంతెల్పారు. బలాబలములు తెల్సుకోవడానికి అనంతపల్లి వైపునకు బయలుదేరి మార్గమధ్యములో, నల్లజర్లలో కారు ఆపి, ప్రకాశరావుపాలెం పెత్తనదారుగారి అల్లుడైన వల్లూరి వెంకటదుర్గాప్రసాదరావుగారిని కారు యెక్కించి, అనుకొన్నచోటికి జేరారు. అనంతపల్లిలో నాయకులతో సలహా చేసారు. ఆదిని మీాతరపున సుబ్బన్నచౌదారీగారు అడిగినప్పుడే వెంకట రత్నంగారికి జిల్లాబోర్డు వోటు యిస్తానన్నాము. ఇప్పుడు చౌదరీగారిపేరు పోయింది గనుక, నిస్సందేహాముగా మరొకరికి యివ్వమన్నారు. ఆలాగున కాదు. తాలూకాబోర్డు వోటు నాకున్నూ, జిల్లాబోర్డు వోటు వల్లూరు వెంకటదుర్గాప్రసాదరావుగారికిన్ని యివ్వవలసినదని చెప్పారు. దానితో ప్రకాశరావుపాలెంలోని రహస్యాలోచనలలోని చౌదరీగారి చాటుమంత్రాంగం వెల్లడయినది. దానితో తేలింది రంగు. చౌదరీగారి చెవిలోమాట పూర్తిగా పట్టిచ్చినది.

ఆలపాటి సుబ్బన్నచౌదరీగారు.

సాలుగుజస్తా డిస్ట్రిక్టు & తాలూకాబోర్డు మెంబరు.

పశ్చిమగోదావరిజిల్లా - చోడవరం.

ఈయన ప్రయత్నఫలితము.

ఈయన నివాసస్థానము తాడేపల్లిగూడెం తాలూకాలోని చోడవరంగ్రామం. ఈయనస్థితి సామాన్యమేకాని,

కుటుంబము పెద్దది. ఆలోచన లెక్కువేగాని ఆదాయము తక్కువ. కుటుంబాస్తిలో ఆయన వాటాకువచ్చిన మెరక య 3-0 లు; పల్లం య 0-75 ట్లు; కాపురమున్న యిల్లు యీాయనకట్టినదే నటగాని, భార్యపేర వున్నట్లు వదంతి. బహుశాయిది నిజమై యుండను. ఈయన కుటుంబమునకు సంబంధించిన భూమి అంతా జమీాందారుల వలన అనుగ్రహింపబడినదేగాని డబ్బిచ్చికొన్నది గాదట! గవర్నమెంటు గ్రామములలో ఒక శెంటైనను లేదు.

దరిమిలాను ఈయన స్వార్జితము రెండుయకరములు. అది అయినా శ్రీ తెలికిచర్ల జమీాందారుగారి వలన ప్రసాదింప బడినది. ఒకప్పుడు శ్రీరాజాగారు తాలూకాబోర్డు ప్రెశిడెంటు కొఱకు ప్రయత్నించినప్పుడు శ్రీ వారికి తనవోటు యిస్తానన్న మీాదట అనుగ్రహింప బడినదట! కాని వోటుమాత్రము శ్రీరాజాగారికి యివ్వక కలిదిండి గంగరాజుగారికే యిచ్చారట!

ఈయన యిదివరకు రమారమి యేడెనిమిది సంవత్సరములనుండి తాలూకాబోర్డు మెంబరుగాను, జిల్లా బోర్డు మెంబరుగాను వుంటూయుండెడివాడు. ఈపర్యాయముకూడా తానే వుండవలెనని సంకల్పించుకున్నాడు. వెనుక శ్రీ తెలికి చర్ల జమీాందారుగారికితన వోటు స్తాయినని రెండు యకరముల భూమి ఇనాంగా పుచ్చుకొని కూడా

తనకే వోటు చేసి నాడనే కారణముచేతనో, లేక మరి యే యితర కారణముచేతనో పార్టీ నాయకులగు గంగరాజుగారు కూడా ఆయన వుద్దేశములో యింత కంటె ముఖ్యులు ఆప్తులు వున్నప్పటికిని, వారిని లక్ష్యపెట్టక, సుబ్బన్న చౌదరీగారి అభిమతమునే అనుసరించారు.

ఈ సహాయము చూచుకొని, ఈయన యీసంవత్సరము కూడా సిద్ధమైనాడు. ప్రచారం సాగించడం మొదలు పెట్టాడు. అన్నదమ్ము లిద్దరికి చెర్మో హోదా పనికి రాదన్నాడు. ఒక కుటుంబములో వాళ్ళసలే వుండకూడదన్నాడు. మొగుడూ పెళ్లాలుండట మనేది చెవినే పడకూడదన్నాడు. ఈ రెండు పదవులు తనకే వుండాలన్నాడు. తన పూర్వులకీ పదవులు రెండున్నూ మొగలాయి చక్రవర్తులు, ఢిల్లీలో శాశ్వత పట్టా యిచ్చారంటాడు. కాబట్టి వంశ క్రమానుగత హక్కీయనదేనట. ఈవిధంగా ప్రచారం సాగించడం మొదలు పెట్టాడు. తుదకు నామినేషనుల సుముహూర్తం సమీపించినది. సరంజామంతా సిద్ధపరుచుకున్నాడు. ఇంతలో వోటర్ల లిస్టులో నుండి పేరు తీసివేయబడిన దనే పైలకబురు వచ్చింది.

ఈ మాట వినటం తోనే నడుము లటుక్కు మన్నది. పై ప్రాణాలు పైన, క్రింది ప్రాణాలు క్రింద జారి పోయి మూర్ఛిల్లాడు. కాని కొంతసేపటికి తెప్పరిల్లి తెలివి తెచ్చుకొని ఆలోచించడం మొదలు పెట్టాడు.

అన్యాయముజరిగిన వాళ్ళకు న్యాయము ప్రసాదించేది హైకోర్టు వున్నదిగదా అనుకున్నాడు. న్యాయాధిపతులకు వినయపూర్వకముగా విన్నవించుకుంటే నిర్జీవిని సజీవిగా చేస్తారని భ్రమపడ్డాడు. తక్షణం ఆపిడతా యీపిడతా తడిమి నూరు రూపాయిలు పట్టుకొని రయ్యిమని రైలెక్కి మద్రాసు వెళ్లాడు. న్యాయాధిపతులకు నివేదించుకున్నాడు. పుణ్యాత్ముల ప్రాణములు తెప్పించగలముగాని యిటువంటి ప్రాణములు తిరిగి తెప్పించడం మావశం కాదన్నారు. నిలువవుంటె భత్యం దండుగని శీఘ్రముగా బయలుదేరి యింటికి వచ్చాడు.

ఇంటికిజేరినది లగాయతు యికముందు గతేమిటిరా అనే పరితాపమే. పార్టీభర్తకు మోక్షమెట్లాగో అని ఆలోచించడం మొదలుపెట్టాడు. బంధుమిత్రపరివారాదులతో సలహాచేసాడు. ఒక దత్తుడిని లేవదీసాడు. అతనిని వెంటబెట్టుకొని పూరూరా తిరగటం మొదలు పెట్టాడు. కొన్నిగ్రామాలలో భిక్షపెట్టమన్నాడు. బ్రతిమాలేచోట బ్రతిమాలాడు. ప్రాధేయపడేచోట ప్రాధేయపడ్డాడు—కాళ్ళు పట్టుకుంటూయుండెవాడుకూడాను. చేతులుగావు యివి కాళ్ళు అనుకోమంటూ యుండేవాడు కొన్ని గ్రామాదులలో. ఈపరితాపమంతా దత్తుడికొరకే- దత్తుడెందుకంటే పార్టీవుత్తరగతికన్నాడు. ఈవిధముగా పార్టీ మోక్షముకొఱకీయన తంటాలు పడ్డాడు.

కులస్థుల దగ్గిరకు వెళ్ళి కులపోడు గనుక వోటివ్వమని అడిగినప్పుడు, బుద్ధిమంతు లెవరయిన నాయెమరపడి, నీవోటు పోయిందికదా నీకెందుకీ పరితాపమంటే పార్టీ నుద్ధరించడాని కన్నాడు. వివేకముగల బుద్ధిమంతులు వుండరు గనుకనా? అట్టివారిలో కొందరు మనము మాంసభక్షకులమైనప్పటికిన్ని మన శరీరమునందలి మాంసమును మనము వండుకొని తిన నొల్లక తినుటకు అర్హమగు కోళ్ళు మొదలగు వాటి మాంసము నె ట్లపేక్షింతుమో అట్లే యితరులు కూడ మనవోట్ల నపేక్షింతురని యెందుకు అనుకోకూడదు? అంటే నోరెల్లబెట్ట మొదలుపెట్టాడు. చింత చచ్చినా పులుసు చావలేదన్నట్లు పేరుపోయినా పరితాపము తగ్గలేదు.

ఈయనకు లోకల్‌బోర్డులలో ప్రవేశ మబ్బజేసినది శ్రీ మీర్జాపురం రాజాగారు; రుచి మప్పినది శ్రీ తెలికిచర్ల జమీందారుగారు; నాయకత్వ మలవడజేసినది కలిదిండి గంగరాజుగారు; ఈయనకు వంశక్రమానుగతమగునట్టియు అర్హమగునట్టియు పూర్వప్రవృత్తియందుండనీయక పెడత్రోవలను త్రొక్కించి యింతవర కీయనను పై కెక్కించినందుకు పైన పేర్కొనిన మహాపురుషులు ముప్వురు వందనీయులే.

గతించినదానికి వగచిన పనిలేదు గాన, మళ్ళీ వచ్చే యెలక్షనులనాటికి యీయన్ని వోటర్ల జాబితాలో చేర్పించు

మని భగవంతుని ప్రార్థించుచూ, యిపుడు యీయనకు జరిగిన ఘోరవిపత్తునకు మాసాదరసానుభూతి నందజేయుచున్నాము.

—య. వెంకటరత్నంవ్రాలు.

ఇట్టి ఈయన ప్రియత్నమునవలన, నాకు వపనమైనది. ఈయన నమ్మినపార్టీభర్తకు సర్వాంగక్షౌరమైనది. ఈయన లేవనెత్తిన దత్తునికి ముండనమైనది. సత్పురుషుల సదుద్యమములకు అల్పజ్ఞులగు మానవులు విఘాతములు కల్పించుటవలన యెట్టి చేటుమూడునో తెలిసికొనుటకు యిది యొక గుణాపాఠమై యలరారుగాక !

## నా గెలుపు నమ్మకమునకు హేతువులు.

వెంటనే అనంతపల్లినుండి నాకు వర్తమానం వచ్చినది. బయలుదేరి వెళ్ళాను. జరిగిన సంగతంతా చెప్పారు. ఇదేమిటన్నారా: గంగరాజుగారి సహాయముపై నేనాధారపడియుండ లేదు. మీ మీద ఆధారపడియున్నాను. మీ రుండ మంటే యుంటాను. లే దంటే మానివేస్తాను. యేమిటి మీ అభిప్రాయమన్నాను. త్రినేత్రుడు అడ్డుపడినా, మీకు సహాయం చేయడం మానము. మీరు తప్పకుండా నిలువండి అని చెప్పినారు. తదాది ఫిర్కాలోని అన్నిగ్రామములు తిరిగినాను. పెద్దలను, పార్టీనాయకులను, కరణాలను, మునసబులను కలుసుకొన్నాను. తెలికిచర్ల: జమీందారుగారిని ప్రత్యేకం కలుసు

కున్నాను. సన్నిధానవర్తియగు పెమ్మరాజు క్రిష్ణారావుపంతులు గారిదర్శనంచేసాను. కంకణంకట్టుకొనిపని చేస్తామనిఅభయహస్త మిస్తూ ప్రమాణం చేశారు కూడాను. తాడేపల్లిగూడెంలో తిమ్మముంటారుగదాఅనుకున్నానుకొమ్ముగూడెంలోసెతికినిలువ బడే కోమట్లు మనవాళ్ళేగదా? పట్టింపాలెం రాజులు తుమ్మల పల్లి కామరాజుగారినిబట్టి నాకు ఆత్మబంధువులేగదా? అప్పా రావుపేట పెద్దమునసబు, చిన్నమునసబుగార్లు అంతరంగశుద్ధి గా మాట్లాడినారుగదా? మోదుగుగుంట నాయకుడు గార్ల పాటి నారాయణస్వామిగారు చెర్వుగట్టున, మూడు తోవల మొగను కూర్చోబెట్టి బుర్రగుంజు నైవేద్యంపెట్టి నమ్మ బలికినవాడేగదా? కడియం ముఠాకు కరణంగారు మునసబు గారు, వగయిరాలున్నూ, కొండ్రుపోలు ముఖాసాదారుగారు, దేశపాండ్యా తుమ్మలపల్లి కామరాజుగారు, శిమకుర్తిచంద్రయ్య గారు, వగయిరాలు కాసుకుంటూ మన్నారుగదా? తాడెపల్లిగూ డెం సీమలో నారయ్యతాతగారు, మీతమ్ముడుగారికీ మాకూ పార్టీగాని, మీతో మా కెట్టి పార్టీ లేదుగనుక, మీకు వ్యతిరేక ప్రచారము చేయనని అప్పుడప్పుడు చెవిలో చెపుతూయుండే వాడేగదా? ఇక తాడిపిల్లి మునసబుగారు, సుబ్బన్న లేకపోతే నీకే గాని యితరుల కివ్వమని నాతో చెప్పడమే కాక, దుర్గమును యివ్వమని తిరిగి అడిగినప్పుడు, నీకుపోయింది గదా ? యిం కొకరిని గురించి నీ కేబా ధేమకు? నీవరఖాస్తు

తరువాత వెంకటరత్నంగారిదే గనుక, ఆయనకు తప్ప యిత రుల కివ్వమని, నిష్కర్షగా తాలూకా ఆఫీసులో నాయెదుట చెప్పిన వాడేకదా? చినతాడిపిల్లిలో, కార్తీకపౌర్ణమిరోజున, రామస్వామికోవలెముందర రాత్రి 12 గంటలకు గ్రామస్థు లందరు మీటింగు జేసి జిల్లాబోర్డువోటు వెంకటరత్నం గారికే గాని యితరులకు యివ్వకూడదని తీర్మానించిరి. కదా? వెంకట్రామన్నగూడెం కరణం మా బావమరిదేగదా! ఆమాత్రము పలుకుబడి వుండదా? అయినా నను స్త్రధర్మములు తెలిసిన దొరలు మనపక్షమేకదా? ప్రకాశరావుపాలెంలో పెద్ద షాహుకారైన నున్న వెంకయ్యగారు పెత్తందారు వగ యిరాలకు నచ్చచెప్పి మీకే వోట్లు వేయస్తాను కాబట్టి, మాగ్రామం కోసం మీరు పరితాపపడి ప్రత్యేకం తిరుగక యితరపని చూచుకోండి అని చల్లగాచెప్పిన వాడున్నాడు కదా ? మనకేమి భయము అను కున్నాను. ఆవుపాడు మున సబు-కరణముల దర్శనం చేశినాను. మునసబు ఆలోచిస్తా నన్నాడు. కరణం నేను కాసుకుంటానన్నాడు. కాని, ఆను చిక్కనీయలేదు. శింగరాజుపాలెంగ్రామం ఉంగుటూరు పెద్దకరణంగారు చెప్పినదాకా యెవరికిమాట యివ్వ కుండా వున్నా రన్నసంగతి తెలిసి, వెంటనే ఆయనను వెంటబెట్టుకొని వచ్చి యింటింటికి తిప్పాను. అందరూ ఊ, ఊ అన్నారు. మారెళ్ళమూడి పొలిమేరలోకి వెళ్ళేటప్పటికే

మీతోడల్లుడుగా రిదివరకే చెప్పారు. మీకొకవోటనిన్ని బస వయ్యకొక వోటనిన్ని, మీ రిం కెందుకూ రావడమన్నారు. పుల్లలపాడు వారంతా మా రెళ్ళమూడికి పాయికారి రహితులే కదా? దూబచర్లలో జిల్లాబోర్డు వోట్లన్నీ మీకే వేయిస్తానని మునలికరణం రాత్రిరాజు వెంకయ్యగారు ఆవుపాడులో తన బావమఅదిగారి యింటివద్ద భోజనానికి లేవబోతూ అభయహస్త మిచ్చినవాడేకదా? ఘంటావారిగూడెం నాయకుడు యల మర్తి వీరాస్వామిగారు నల్లజర్లరోడ్డు మొగను కారు దిగి యింటికి వెళ్ళబోతూ, సుబ్బన్నకు వోటుతిరిగి రాకపోతే మీ తరఫున పనిచేస్తానని నమ్మబలికిన వాడేకదా? చీపురుగూడెం చెల్లు వెంకటాద్రియుడుగారు జిల్లాబోర్డు వోట్లు మీకున్నూ, తాలూకాబోర్డువోట్లు బసవయ్యకున్నూ అని ధారాళంగా అందరితోనూ చెప్పినవాడేగదా? కవులూరు కరణం, పోతు రెడ్డిపాలెం కరణాలు వియ్యంకులేకదా! యీమాత్రం సహా యము చేయకపోతారా? పోతవరం కరణంగారు యుగంధర మంత్రివంటి వాడుకదా? ఆశ్రయిస్తే సహాయము చేయక పోతాడా అనే నమ్మకం నాకు కలిగినది. పై విషయము లన్నియు, స్వయముగా నే నెరిగినవాడ నగుటవల్ల నాకు నమ్మకము కలుగదని మీరూ చెప్పగలరా? ఇంతమంది సంపన్న గృహస్థులు, సంబంధ బాంధవ్యమున్న వారలు, హితము కోరినవారలు, ప్రపంచజ్ఞానము గలవారు- యీస్వల్ప విష

యములో లోపల ఒకమాట, పైన ఒకమాట ఆడుతారని కల్మషములేని హృదయముగల మానవు డెవ్వడూ అనుకోడని, నాకు వోటిచ్చుటలో వోటర్లను ప్రోత్సహించక అడ్డువచ్చెదరని కలలోనైనను అనుకోలేదు. ఇవి నేను గెలువగలననే నమ్మకము పుట్టుటకుగల హేతువులు.

ప్రతివోటరును చూడక, వీరినిమాత్రమే చూచి, వీరాధారపడియుండుట న్యాయమా అని కొందరికి సందేహము తోచవచ్చును. ప్రజలు గోవులవంటివారు. వాటిని కాపరులెట్లు మరలిస్తే అట్లు మరలుట నైజము. మందలో పాలు పితుకుకొనుటకు బోయవాడు పాలచెంబు పట్టుకొని వచ్చినపుడు, కాపరిమందను రెచ్చగొట్టి, త్రోవ మరలిస్తే పాలు పితుకుట యెట్లుసాధ్యపడును? అందువల్ల ముందుగా కాపరితో సంగతులన్నియు వివరిస్తేనేగాని, మందను రెచ్చగొట్టి మరలిస్తాడేమో అనేభయం. కాబట్టి ముందుగా నాయకులను జూడవలసిన్ని అగత్యమిది అని నాలభిప్రాయము.

## నామినేషను నాటికి నే నున్నస్థితి.

చెప్పులు తొడుగుకున్న వానికి భూమిఅంతా తోలుతో కప్పబడియున్న ట్లగుపించినట్లు, నామినేషనులు తీసుకొనుటకు నిర్దిష్టమైన తేదీనాటికి, ఫిర్కాఅంతా నావాళ్లే అనుకున్నాను.

నేను అభేద్యమగు దుర్గములో సురక్షితముగా నున్నట్లు సంతో షించినాను. ప్రత్యర్థులు నాకెదురు పడుట తటస్థించినప్పుడు, నా తెలివితేటల ముందర వాండ్ల తెలివితేటలు, దివిటీముందర దీపమువలె వున్నవి అనిమురిసే వాడను. దైవ మొకడున్నా డనే నమ్మకముండేది. ఈ నాప్రచారము విజృంభించుటకుగల కారణము దైవబల మనుకునేవాడను. చేతిలో చెయ్యివేశిన వాళ్ల చేతులన్ని సజీవముతో వున్న చేతులే అనుకున్నాను. వాగ్దానము చేశినవదనములన్నియు సత్యసంధులవనుకున్నాను. గాని, నామమాత్రపు మానవుల వనుకొనలేదు. బుజ్జగించిన వాళ్లంతా నాహితము కోరినవాళ్ళే అనుకున్నాను గాని, తేనె బూసినకత్తు లను కొనలేను. ఆదరించి సాగనంపిన వారంతా నామీద దయచేత మర్యాదకొఱకు వెంటనంటి వచ్చుచున్నా రనుకొన్నానుగాని, ముందుగోతులు తీసి నడిపిస్తూ యున్నా రనుకోలేదు. బంధువులందరు బాధ్యత వహిస్తారనుకొన్నాను గాని, నన్ను ముట్టుకోకు నామాలకాకి అన్నట్లుంటా రని యెన్నడూ అనుకోలేదు. నా కెదురుగుండా నా ప్రత్యర్థులతో ఖండితముగా వెంకటరత్నంగారికే గాని మీకువోటియ్య మని చెప్పడం, నామీద నిర్హేతుకజాయమాన కరుణాకటాక్షమే అనుకొన్నాను గాని, నన్నడ్డముబెట్టుకొని, తమ కష్టము లను నిర్ణయించు కొనుట కనుకోలేదు. నేనీ ప్రచారము చేయుకాలములో కులతత్వము అడ్డువచ్చునేమో అని తూర్పు

గోదావరిజిల్లాలోని నాకు ఆప్తుడును. సంపన్న గృహస్థున్నూ అగు ఒక కమ్మ సంసారియింటికి వెళ్ళినాను. ఆయనను వెంట బెట్టుకొని వచ్చి నాగుణగతములనుగురించి యీఫిర్కాలోని కమ్మవారికి యెరుకపరిపించా లని నా అభిప్రాయము. నేను వెళ్ళేటప్పటికి ఆయింటియజమాని యింట్లో లేడు. ఈలోగా భార్యతో సంభాషించుటలో, 'అమ్మా, దేశంలో దరిద్రం యెక్కువై నది. వెండిబంగారములు పోతున్నాయి. కన్నోడు చుకున్నా డబ్బుపుట్టడంలే'దనియేదోమాటవరుసను అన్నాను. అంతలో, ఆమె అందుకొని, 'రత్తయ్యగారూ, మనిషిమాట్లా డేమాటలో నూటికి ఒక్కమాటైనా నిజ ముండనప్పుడు, భూదేవి పూరా పంటపండమంటే యెల్లా పండుతుందండీ!' అన్నది. భూదేవి తల్లి వంటిది. మీతల్లిని మీరు సత్ప్రవర్తన వల్లరంజింప జేయకపోతే మీకామె కడుపునిండా అన్నంపెట్టు తుందా ! నీతికి నిలవబడే ప్రజలసంఖ్య పెరుగజొచ్చినకొలది, భూమియందు పండుపంట పాళ్ళు హెచ్చుతూయుంటాయి. ఇది మీకు నిదర్శనము-అన్నది విన్నాను. నిరుత్తరుడనై తెల్లపోయి నాను. దరిమిలాను, నేను ఫిర్కాలో కాన్వాసు జేసేటప్పుడు యీసాధ్వీమతల్లి వాక్కుస్ఫురణకైనను రా లేదు.

కులతత్వము బయటపడి, నన్ను బాధిస్తుందేమో అను కొని, ఆయనను తీసుకొనివచ్చి ప్రచారంచేయవలె నను కొన్నానుగాని, నాకు ప్రత్యర్థులగు మిగిలిన యిరువురును,

కమ్మవారే అయియుండుటవల్లను, వారిరువురు చివరవరకు తీవ్రప్రచారము సాగిస్తారనే వదంతి బయలుదేరుటవల్లను వారిలో వారికే పోత్తుకుదరనప్పుడు, కులతత్వమంత తీవ్రముగా నాప్రచారమున కడ్డురాదని నమ్మి నే నాప్రయత్నము నుండి విరమించినాను.

## వోటర్లకు నేనుచేసిన ప్రచారము.

కొంతసేపు నిదానించి, సాధన మేమిటా అని ఆలోచించగా ఆలోచించగా, యిదివరకు జరిగేతంతు లన్నిటిని తెల్సుకొని అవగాహన చేసుకొని అటుపిమ్మట భవిష్యత్తునందు ప్రయత్నించే వారికిగూడా వుపయోగపడే పన్నాగ మొకటి పన్నుదామని. నిశ్చయించుకొన్నాను. పాతపద్ధతు లన్ని తిరిగవేయడం మొదలుపెట్టాను. ఫారెస్టు గార్డును లోపాయికారీ చేసుకుని, సమీప గ్రామమందలి పొండుకీపరు, యేవిధమగు అపరాధము చేయని పూరకశువులను, దౌర్జన్యముగా పౌండుకు తోలించి, బందెలఫీజు వసూలుచేసి చీటీ యివ్వకుండా వదలిపెట్టుతూ అందువల్ల వచ్చేలాభమును వుభయులు పంచుకొనుట పరిపాటైయున్నట్లు, కొందరి నాయకులకు కంట్రాక్టు లిస్తామని భ్రమపెట్టి, చేసినపని చెక్కు-మెషరు చేయకుండానే, బిల్లులు ప్యాసు చేయించే జవాబుదారీ నాదని, చేతిలో చెయ్యివేసి, నిరప రాధు

లగు ప్రజలను వారిచేత పోలింగుస్టేషనులకు తోలించి, అక్కడకు వచ్చేవరకు యెవరికి వోటియ్యవలెనో చెప్పక, క్యాండిడేటుకు తమకు జరిగిన యేర్పాటులన్ని అమలు జరిగిన పిమ్మట, వోటు వెయ్యవలసిన దెవ్వరికో వారి పేరు చెప్పి పంపించడం రివాజని తెలిసినది. నా కట్టి సౌకర్యము లేదు కదా, దీని నెదుర్కొను టెట్లా యని మనస్సు పరితపింపసాగి నది. కాని, వోటర్లకు తమ నిజరూపమును బోధించి, తమ రిని అడ్డము వేసుకొని, నాయకుల మనుకొను బోర్డుకర్లు పొందే అక్రమపు లాభమును బయల్పెట్టి, బోర్డుకర్ల బారినుండి వోట ర్లను విడదీసి, నాకు మెంబరీ వుద్యోగము లభించినా లభింపకపోయినా సరే, వోటర్లలో ప్రబోధము గావించి వారి ప్రేమకు పాత్రుడ నగుటయే నా కర్తవ్యమని నిశ్చ యించితిని. ఒకప్పు డట్టి ప్రేమకు నేను పాత్రుడను కాగలిగి తినా, అది నాకు పితురార్జితమగు స్థిరాస్తి వంటి దనే నమ్మ కము కుదిరినది—వెంటనే-

అని రకరకముల కరపత్రములు నచ్చొత్తిప్పించి, ఒక వెయ్యి ప్రతులను వెంటబెట్టుకొని, వారమున కొకసారి పంచిపెట్టడం ప్రారంభించినాను. ఒక కూలివాని నేర్పాటుచేసి, వానిచేతికి కొన్ని కరపత్రముల నిచ్చి, మనిషివున్నా సరే, లేకున్నా సరే యింటింట నొక్కొక్కటి చొప్పున ప్రవేశపెట్టమని చెప్పి పంపించేవాడను. ఈవిధముగా నాలుగు వారములు సాగించే సరికి, ఆకలిగొన్నవాడు అన్నము కొఱకాశించినట్లు, పల్లెటూరిలోని ప్రతి వోటరున్నూ ఆదివారము సంతసాగించుకొని తిరిగియింటికి జేరడంతోనే, యెలక్షను ఆవేశముచేత వీరావేశము చెందిన ప్రతిమానవుడును నాకరపత్రములకై నిరీక్షించుచుండెడి వాడట. ఈసంగతి తెలిసి, నాఉద్దేశము నెరవేరుచున్నదిగదా అనే వుత్సాహము దినదిన ప్రవర్ధమానమగుచుండెడిది. ఈవిధముగా ఫిర్కాలోని గ్రామములన్నిటిలోను ప్రచారము సాగించుచూ నాయకుల యందొక విధమగు భయమును త్పాదింపజేసి, వోటరులను జేరదీయుచుండెడివాడను. క్రమక్రమముగా మనిషిని చూస్తే చెదిరి పారిపోతమే కాక,

చనువు చేసిన పిమ్మట బెదరువదలి, చేతిలోని బియ్యమును ముష్టితో పొడుచుకొని తినేటంత చనువైనట్లు, ఎలక్షను పోలింగురోజున, ఏపొలములోనో వుండి, ప్రత్యేకము తన కొఱకు మనిషి వచ్చేవరకు తెలియని స్థితిలో వుండే వోటరును, రేపటి రోజున మెలక్షను గనుక యీరోజున నేను పోలము లోనికి రా ననే స్థితిలోనికి మార్చినాను.

మెలక్షను తేది యింకను యిరువై రోజు లున్న దనగా, ప్రతిగ్రామములోను మకాము చేసి యింటింటికి తిరిగి ప్రతి వోటరుతోను పరిచయము కలుగ జేసు కోవలె ననే సంకల్ప ముదయించినది. ఇందునిమిత్తం కొంత మందిని వెంటబెట్టుకొని తొలుత నొక గ్రామమునకుబ యలుదేరితిని. మా ప్రచారము పూర్తియగుసరికి రమారమి అపరాహ్ణం తిరిగినది. అటుతరువాత నాతో కూడావచ్చినవారికి భోజనసదుపాయ మెట్లాయని ఆలోచించితిని. వేళగాని వేళ-రమారమి 10, 12 మంది యున్నారు. అంతా ఒక్కకులము వారుకారు. వి వి ధ కు ల ము ల వా రు. అర్ధాంతరముగా యెవరియింటిమీద పడితే యేమనుకుంటారో అనేభయం. యెవరింటిమీదైనాపడి, బలవంతపెట్టితే మొగమోటంచేత పెడతారుగాని, మనవల్ల యేవిధమగు ప్రత్యుపకారం పొందుటకు సావకాశముగాని వారి యింటిమీదపడి యిరువైవిస్తళ్లు లేవనెత్తడం యేటిన్యాయమనే సంకోచం. ఇదిన్నీగాక అది

రెడ్డిసీను. పన్ను మెచ్చిపితే పంసుం ఆకలి తీసుతుం దనే సంసారములు. పంబువాడి కి స్తర్రివేస్తే, పూటగ్రాసం తసుగుతుందనే భీతాహాముతో కంపితములైయుండే కుటుంబాలు. ఇట్టివన్ని తలచుకొని, ఇదిపని కాదనుకొని వంటకుకావలస్ని పరికరములు, సామగ్రి తెప్పించి, పాకంచేయించవలెనని నిశ్చయించినాను, వెంటవచ్చినవారిలో నొకనిని నీళ్లకు, మరియొకని పుల్లలకు యింకొకనిని విస్తరాకులకు, యింకొకనిని వంటకు, వేరొకనిని వడ్డించుటకు, యింకొకరి నివిస్తళ్లు తీసివేయుటకు నియోగించినాను. దానితో ఆపూట గడిచినది. సాయంకాలమునకు యింటికి చేరినాను. నాటితో అనుచరుల నావెంటబెట్టుకొని ప్రచారం సాగించడం మానివేసినాను. మరునాటినుండి ఒకకూలివానిని వెంటబెట్టుకొని పెట్టె వాని చేతికిచ్చి తెల్లవారేసరికి ఒకవూరు చేరడంనిత్యవిధులు నిర్వర్తించుకుని, చెర్వుగట్టున కాఫీకాచుకొని పుచ్చుకొని, క్రమంగా 11 గంటలవరకు వూరిలోని పెద్దలను చూస్తూ మధ్యాహ్నమయ్యేసరికి యే కరణంగారింటికో చేరడం, భోజనం అవశిష్టం తీర్చుకోవడం మొదలుపెట్టాను. ఈవిధముగా ప్రచారం చేయుటవల్ల చాల సౌఖ్యముగానే వుండేది. ఇంటివద్ద సామాన్యసంసారివలె భోజన మమరేదికాని యీవిధముగా సంచారము జేయుచుండుటవల్ల యించుక కుటుంబప్రతిష్ఠ కలవాడనున్నా బ్రాహ్మణ్యములో ఒక కుటుంబముతో మరియొక కుటుంబము, యేదోవొక విధముగా

సంబంధ బాంధవ్యములు కలిసియుండుట సహజమగుటవల్లను ప్రత్యేకసౌకర్యములతో, పప్పులు పాశాలుతో విందులార గించడం తటస్థించేది. ఒంటరిగా సంచారం చేయడం సౌఖ్యము గాయుండేది కూడాను. యెందువల్లననగా ఖర్చుతక్కువ. కాలినడక యగుటవల్ల బాడి అద్దె తగులుబడి అయ్యేదికాదు. ఇదిన్నిగాక ఈఫిర్కాలో సంచారము చేయడములో చిత్రమైన విశేష మొకటికూడా వున్నది. అది యెద్ది యనగా, ఈ ఫిర్కాను సంబంధించిన యిరువైరెండు గ్రామము లలోను ఒక్క తాడేపల్లిగూడెం గ్రామంలో తప్ప తదితరచోట్ల కాఫీహోటళ్ళుగాని, పూటకూళ్ళ యిండ్లుగాని లేవు. తాడేపల్లి గూడెంనుంచి అనంతపల్లివరకు మాత్రమే మోటారు సౌకర్య మున్నదిగాని, తదితర గ్రామములకు పోవలెననిన పుంతలుతప్ప రోడ్లులేవు. పుంతలలో బాడిపైన ప్రయాణము సాగించుద మనుకొన్నను, బండిరోజాలవెంట, దొంగవూబితో పూరింపబడి యుండు నిలువుడే సి గోతు లుండుటవల్ల, బండిమీద ప్రయాణము చేయనుద్దేశించినవాడు యిల్లుబయలుదేరిన వెంటనే ఖర్చువ్రాసుకొనబడి, తిరిగి యింటికి జేరినప్పుడే జమ కట్టుకొనబడవలసి యుంటుంది. గొయ్యి వున్నచోటదిగి, దానిని దాటినతర్వాత, తిరిగి యెక్కి ప్రయాణము సాగించవలెననుకొన్నను, గోతిలో దిగబడిన ఖాళీబండిని, యెద్దును పైకిలేవదీయుబొయ్యేసరికి, బండిలో

కూర్చున్న కాలములో అనుభవించిన శరీరసౌఖ్యమున్నూ, బండిని యెద్దును లేవనెత్తుటలో జరిగిన కాలయాపన యెడ్లు వడిగానడచుట వలన కూడివచ్చిన శీఘ్రగామిత్వమును, అందులో కూర్చుండుటవల్ల అనుభవించిన సుఖమును మించి యుండును. ఇవి ఈఫిర్యాలోని ప్రచారమునకుగల సౌకర్యములు. అందువల్ల ఒకపర్యాయము వెంటవచ్చినవారు తిరిగిరారు. ఇందులకు దృష్టాంత మొకచిన్న సంగతిని తమకు విశదపర్చుకొనుచున్నాను. నే నొక పర్యాయము అనంతపల్లినుండి బయలుదేరి చోడవరం మీదుగా తాడేపల్లిగూడెం రావడములో పడినపాట్లు: అనంతపల్లినుండి చోడవరం రమారమీ రెండు మైళ్ళుంటుంది. ఈ రెండు మైళ్ళూ పుంత. ఈపుంతలో మూడు పర్యాయములు బండిచక్రము బురదగోతులలో పడుటతటస్థించినది. ప్రతిపర్యాయము చక్రింకూచను వరకు దిగబడటం. గోతివైపున లాగేయెద్దు జబ్బల లోతుకు దిగబడడం. చక్రాన్ని యెద్దును బయటకులాగే సరికి బండిలోనే వానికి తలప్రాణం తోకకురావడం. చక్రం బయటపడేవరకూ లోపలనున్నవారు అరచేతిలో ప్రాణాలు పెట్టుకోవలసియుండటం తటస్థించేది. ఈగండంగడచిన తర్వాత, చోడవరంనుండి వీరంపాలెం రమారమీ నాలుగు మైళ్ళుంటుంది. ఇది గట్టినేలే గాని, ఒడ్డుమెరక పల్లాలు యెక్కువ. వీరంపాలెంనుంచి, వట్లుంపాలెం ఒక మైలేగాని, ఆకులవరకు దిగ

బడి యిసుక పుంతయగుటవల్ల లాగడంలో యెడ్లు పడే తిప్పలు వర్ణింప నలవిగాకుండా వుంటవి. అక్కడనుండి కొమ్మ్మ గూడెం వరకు యెడ్లశ్రమ యెక్కువేగాని, లోనున్న వా రేమి భయపడ నవసర ముండదు. కొమ్మ్మగూడెం దాటిన తరువాత, అడిగారూ తిప్పలు! కిష్టాపురం చెరువులో బండితో సహా యెడ్లు యీదుకొని బయటపడవలసి వచ్చేసది. అక్కడ నుండి కడియద్ద మీదుగా, తాడేపల్లిగూడెంకు రావ లసియుంటుంది. క్రిష్టాపురం దాటిన తర్వాత ఒక మైలువరకు రేవడి. యెడ్లకాళ్ళు దిగబడడం. చక్రాలచుట్టూ మట్టి అంటు కొని, వూడిపోక, అలముకుంటూ, చక్రము బరువెక్కి యెడ్లు లాగలేనంత భారవహమై బండి నడకకు అంతరాయము కల్పించడం. యీ విధముగా వుంటుంది. ఆ మైలు దాటిన తర్వాత జలమయం. మామూలుగా నడిచేవారలకే గాని, తదితరులకు మార్గ మగమ్యగోచరం. ఇక కడియద్ద దాటిన తర్వాత, కొండ్రుప్రోలు నుంచి, బయట పడేవరకు వున్నాయి పాట్లు. అదు గడుగుకూ మాధవా అన్నట్లు, యిరువై గజాల కొకగొయ్యి. ఈ విధముగా అనంతపల్లి నుండి ఉదయం 10 గంటలకు బయలుదేరి అరగంట కంటె యెక్కువ యేగామ ములోను ఆగకుండా, మరునాడుదయము 8 గంటలయ్యేసరికి 16 మైళ్ళు ప్రయాణముచేసి, చచ్చిచెడి చాయంగల విన్నప ము లన్నట్లు యెడ్లూ బండి నేను యింటికిచేరినాను.

ఇటువంటి రాకపోకల సౌకర్యములుగల ఫిర్కాలో ప్రచారము సాగించడమే చాలకష్టము. అందులో 10 మందిని వెంటబెట్టుకొని ప్రచారంసాగిద్దామనుకోవడముకూడ బుద్ధిపొరపాటే. వెంట నున్నవారికి యిబ్బందిని కల్గుగ జేయుటయే గాక తనప్రచారమునకు కూడ యింతమంది వెంట నుండుటవలన వొక్కొక్కప్పుడు ప్రమాదముకూడాను. ఏలనన, నా వెంట నుండువారు ఆవేశపూరితులు. ఇంచుక నాగరికతావాసన గలవారును అయియుండుట సహజము. నేను ప్రబోధము చేయవలసినది, నాగరికత కలవడనట్టియు, విద్యాగంధములేని ప్రజలలో. ఎదుటివారు ఆవేశపూరితులై మాట్లాడుచున్నప్పుడు, మన అభిప్రాయమును తాత్కాలికముగా మార్చుకొన్నట్లగుపించు టవసరమో, లేక యెదుర్కొని నచ్చజెప్ప జూచు టవసరమో తెలుసుకొనుట సుసాధ్యముగాదు. అట్టి పరిస్థితులు సంభవించినప్పుడు కొంచెము నిదానించు టవసరము. అట్లుగాక, యెవరికి తోచినట్లు వారు చెప్ప ప్రయత్నించినయెడల వాగ్వాదములోనికి దిగకమానదు. వాదోపవాదములు ముదిరినతర్వాత నాతో వున్నవారిని వారింప బ్రయత్నించినయెడల 'యిందుకేనా వెంటబెట్టుకొని వచ్చా'వని నాతరపువాడు నిష్ఠురోక్తులాడకమానడు. వారింపకపోతినా!—'యిట్టి అనుచరులను వెంటబెట్టుకొని వచ్చినావు. నీకార్యము భాగానే గట్టెక్కుతుం'దనే క్రోధభావముమాపి, తన మూర్ఖ

త్వమును మరింత ఘనీభవింపజేయకమానదు మొదటివాడు. పదిమంది వెంటనుండుటవల్ల, యెవరికి తోచినమాట వా రనక మానరు. అట్టి స్థితిలో ఏకభావము కుదురుట కష్టసాధ్యము. కార్యసాధనకు సంఘమునందు ఐకమత్యముండనియెడల విఘాతము రాకమానదు. కాబట్టి అదవులోనుండని అనుచరులసంఖ్య మితిమీరుచున్నకొలది, కార్యసాఫల్యతదూరమగుచుండుననుట తథ్యము. ఇదిన్నీగాక, ఒకనికి నాయం దంతరంగశుద్ధియగు ప్రేమయే యుండును. కాని వాని కుండు యీతిబాధ ననుసరించి, మరియొకనియొద్ద నన్నూ తూలనాడి వానిని ప్రేమించిన ట్లగుపించును. ఈసంగతి కర్ణాకర్ణిగా నాకువినవచ్చి, యిందలి యథార్థమును తెలుసుకొనగోరి కొందరిని వెంటబెట్టుకొని, వానిని సమీపించితి ననుకొనుడు. అప్పుడువాడు 'పంతులు గారూ, మీాయందు నాకుగల ప్రేమ కపటముతో కూడుకొన్నది గాదు. నిజమైనదే. నీయందు నాకుగల సదభిప్రాయమునుండి నేనెన్నడును మరవలేదు. నాకుగలకొన్ని యీతిబాధల ననుసరించి, అట్లనక తప్పినదికాదని, యదార్థమును వెల్లడించువాడనుకోండి. అట్టిసందర్భములో, యీమాటలు వినుచుండిన నా వెంటనున్నవారు సదయహృదయులును రహస్యమును గోప్యముగా నుంచువారైననేతప్ప, అడిగాకూ మాయిద్దరితిప్పలున్నూ!! నాకార్యము చెడుటయేగాక నా కుపకారము చేయు నుద్దేశించినవాని నిజరూపమును వెల్లడించినవా రగుచున్నారు.

అనుచరులను వెంటనుంచుకొని ప్రచారముచేయుట కుపక్ర మించుటవలన ఇట్టి యీతిబాధ లనేకము లుంటవి.

ఈవిధముగా నాయకులతోనేగాక, గ్రామస్థులగు వోటర్లతో చాలవరకు పరిచయముకలుగ జేసుకొన్నాను. నేను మార్గమువెంట వెళ్ళుతూయుండగా, ప్రక్కలనున్న పొలములలోనివారు, మీదేవూరు అని అడిగేవారు. మాది తాడేపల్లిగూడెం అనటంతోనే, వోట్లవారా అండీ అనేవారు. అవునడం తోనే మీపే రేవరు బాబూ అనేవారు. నాపేరు యద్దనపూడి వెంకటరత్నం అనే వాడను. బాబూ మీరేనా వెంకటరత్నంగారు. మావోటు మీకే యిస్తా మనేవారు. మావాళ్ళు రాత్రి మీటింగుచేసి మీకే యిద్దా మనుకున్నారండి అనేవారు. మరికొన్ని గ్రామ ములలో, నాప్రత్యర్థులు ప్రచారంచేశి, వోటు యివ్వమని అడిగినప్పుడు, మావోటు ఒకటి పేపర్లబ్రాహ్మడికి యివ్వ నిశ్చయించు కున్నాము కాబట్టి దానిని గురించి మీరు వేరే యేమీప్రయత్నము చేయ నవసరము లేదనే వారట! కొన్ని గ్రామములలో నేను నడివీధినుండి పోతూయుంటే, ప్రక్కనున్న తోడిబాలురతో ఒరే, యీయనేరా యద్దనపూడి వెంకటరత్నంగారు అనివారిలో వారనుకుంటూ, కొంత దూరము నేను ముందుకు సాగిన తర్వాత "వెంకటరత్నంగారికి

త్వమును మరింత ఘనీభవింపజేయకమానదు యెదుటివాడు. పదిమంది వెంటనుండుటవల్ల, యెవరికి తోచినమాట వా రనక మానరు. అట్టి స్థితిలో ఏకభావము కుదురుట కష్టసాధ్యము. కార్యసాధనకు సంఘమునందు ఐకమత్యముండనియెడల విఘాతమురాకమానదు. కాబట్టి అదపులోనుండని అనుచరులసంఖ్య మితిమీరుచున్న కొలది, కార్యసాఫల్యతదూరమగుచుండుననుట తథ్యము. ఇదియేగాక, ఒకనికి నాయం దంతరంగశుద్ధియగు ప్రేమయే యుండును. కాని వాని కుండు యీతిబాధ ననుసరించి, మరియొకనియొద్ద నన్నూ తూలనాడి వానిని ప్రేమించిన ట్లగుపించును. ఈసంగతి కర్ణాకర్ణిగా నాకువినవచ్చి, యిందలి యథార్థమును తెలుసుకొనగోరి కొందరిని వెంటబెట్టుకొని, వానిని సమీపించితి ననుకొనుడు. అప్పుడువాడు 'పంతులుగారూ, మీయందునాకుగలప్రేమ కపటముతో కూడుకొన్నది గాదు. నిజమైనదే. మీయందునాకుగల సదభిప్రాయమునుండి నే నెన్నడును మరవలేను. నాకుగలకొన్ని యీతిబాధల ననుసరించి, అట్లనక తప్పినదికాదని, యదార్థమును వెల్లడించువాడనుకొండి. అట్టిసందర్భములో, యీమాటలు వినుచుండిన నా వెంటనున్నవారు సదయహృదయులును రహస్యమును గోప్యముగా నుంచువారైననేతప్ప, అడిగారూ మాయిద్దరితిప్పలున్నూ!! నాకార్యము చెడుటయేగాక నా కుపకారము చేయనుద్దేశించినవాని నిజరూపమును వెల్లడించినవా రగుచున్నారు.

అనుచరులను వెంటనుంచుకొని ప్రచారముచేయుట కుపక్ర మించుటవలన ఇట్టి యీతిబాధ లనేకము లుంటవి.

ఈవిధముగా నాయకులతోనేగాక, గ్రామస్థులగు వోటర్లతో చాలవరకు పరిచయముకలుగ జేసుకొన్నాను. నేను మార్గము వెంట వెళ్ళుతూయుండగా, ప్రక్కలనున్న పొలములలోనివారు, మీదేవూరు అని అడిగేవారు. మాది తాడేపల్లిగూడెం అనటంతోనే, వోట్లవారా అండీ అనేవారు. అవునడం తోనే మీపే రేవరు బాబూ అనేవారు. నాపేరు యద్దనపూడి వెంకటరత్నం అనే వాడను. బాబూ మీరేనా వెంకటరత్నంగారు. మావోటు మీకే యిస్తా మనేవారు. మావాళ్ళు రాత్రి మీటింగుచేసి మీకే యిద్దా మనుకున్నారండి అనేవారు. మరికొన్ని గ్రామ ములలో, నాప్రత్యర్థులు ప్రచారంచేశి, వోటు యివ్వ మని అడిగినప్పుడు, మావోటు ఒకటి పేపర్లబ్రాహ్మడికి యివ్వ నిశ్చయించు కున్నాము కాబట్టి దానిని గురించి మీరు వేరే యేమీప్రయత్నము చేయ నవసరము లేదనే వారట! కొన్ని గ్రామములలో నేను నడివీధినుండి పోతూయుంటే, ప్రక్కనున్న తోటిబాలురతో ఒరే, యీయనేరా యద్దనపూడి వెంకటరత్నంగారు అనివారిలో వారనుకుంటూ, కొంత దూరము నేను ముందుకు సాగిన తర్వాత "వెంకటరత్నంగారికి

జై" అని కేకలు వేయడం మొదలు పెట్టేవారు. ఈవిధంగా 22 గ్రామాదులలోను నాపేరు పరిచయమైనది.

ఈకాలంలో పల్లెటిగ్రామములలో పూర్వము వలె గాక పలురకముల ప్రజలున్నారని వారడిగే ప్రశ్నలనుబట్టి వూహించ వలసి వచ్చినది. ఇప్పటి వీరితత్వములు బుద్ధులు ఏక తాటిపై నుండక పలురకములై యుండుట సహజము. కాలపరిస్థితులే యిట్టిమార్పులకు కారణమై యుండుననుట నిజము. ఒకానొకప్పుడు పల్లెటిగ్రామములు సంయుక్తసమాఖ్యప్రభుత్వవిధానము ననుసరించి వ్యవహరింప బడుచుండెడివి. సంయుక్త సమాఖ్యప్రభుత్వవిధానము ననుసరించి, యెవరివృత్తివా రవలంబింప వలసినదేగాని, ఒకరి వృత్తిపై అన్నివృత్తుల వారాక్రమింపకూడదనే నియమ ముండేది. అందుచేత ఆకాలములో ఈర్ష్యాసూయలంతగా విజృంభించలేదు. కావుననే కష్టసుఖములలోను, అభ్యుదయానర్థములలోను రాష్ట్రవిప్లవసమయముల యందును శ్మశానవాటికయందును గ్రామస్థులందరును ఏకీభావముతో మెలంగేవారు. ప్రభుత్వవిధానము మారటంతోనే ప్రజలయందలి ఐకమత్యమును చెదరగొట్టి, చిత్తవృత్తులను పలువిధములుగా మార్పొదవించుటకు ప్రోద్బలించు సాధనము లిగురెత్తసాగినవి. తదాది పల్లెటిగ్రామము లందు పార్టీలు బయలుదేరినవి. పరిశ్రమలపై నాధారపడి యుండు దేశమునకు వ్యక్తిస్వాతంత్ర్యప్రభుత్వవిధాన మవసరము.

వ్యవసాయముపై నాధారపడి యుండెడి దేశములకు సంయుక్త ప్రభుత్వ విధాన మత్యంతోపయోగకారి. మనపాలకులది పరిశ్రమలపై నాధారపడి యుండెడి దేశము. వారిపాలనకు లోబడియున్న మనదేశము వ్యవసాయముపై నాధారపడియున్న దేశము. పాలకుల దేశమందలి వ్యక్తిగతవిధాన మీదేశమందు అమలులోనిదే జూచుచున్న కొలది ఐకమత్యత చెడి ప్రజల చిత్తవృత్తులు పలురకములుగా విజృంభించుచున్నవి. ఇదియునుగాక హిందూదేశము వ్యాపారదృష్టితో పరిపాలింపబడుచున్నది. జాతీయాభ్యుదయమపేక్షించి పరిపాలింపబడుట లేదనుట కనేకనిదర్శనములున్నవి. పాలకులు తమ ఆదాయవ్యయముల అంచనా సరిపుచ్చుటలో తమబుద్ధికుశలతను వినియోగించుచున్నారు. గాని, తమచేత పాలింపబడు ప్రజల జీవితమునకు అవసరమగు ఆదాయవ్యయములను సరిపుచ్చుటెట్లాయను చింతపై తమదృక్కులను నిగుడ్చుచున్నట్లగుపించుట లేదు. కావున నానాటికి ప్రభుత్వపువారి ఆదాయవ్యయము లేదో విధముగా సరిపుచ్చబడుచున్న కొలదిని ప్రజల ఆదాయ వ్యయములు సరిపుచ్చబడుటకుగల తెరవులు దూరమై, ప్రజలయందలి దరిద్రము నానాటికి పెచ్చు పెరిగి, జీవితము దుర్భరమగుచున్నదనుట నిస్సందేహము. అన్నాతురులగు ప్రజలయందు, ఐకమత్యము నెలకొని నీతినియమములకు కట్టుబడియుందురనుకొనుట కల్ల. కావున యీకాలమందు రాష్ట్రాభ్యుదయము

నకు బునాదులైన పల్లెటిగ్రామములు కట్టుబడి పార్టీలుపడి చిత్తవృత్తులు పలుతెరంగులై పరువెత్తుట కలవడినవి.

నా ప్రచారములో, పల్లెటిగ్రామవాసుల చిత్తవృత్తులీతీరుగా మార్పుజెందుట కనువుండునని తట్టినదిగాని కుటుంబములో అదివరకెట్టి కలతలున్నను, కష్టసమయములయందు తమస్వబుద్ధిచేతనైతేనేమి, యితరుల ప్రోద్బలములచేతనైతేనేమి యేవిధముగానైతే కలుస్తూయుంటారో అదేవిధముగా యీవిషయములో మీరాకలయిక కలియకూడదా అనుకున్నాను. కాని దరిమిలాను వారిచర్యలను బట్టి మధ్యమధ్య వారు వేసే యక్షప్రశ్నలను బట్టిన్నీ, వారి బుద్ధి గాలిలోని దీపములవలె దరిద్రముచేత చెల్లాచెదరు గావింపబడినదని అనుమానపడవలసివచ్చినది. కావలసినంత భూమి వుండి, దున్ని పండించిన తర్వాత పండిన పంటనుండి, రాజభాగమును పంచియిచ్చు కాలమునాటి ప్రజలచిత్తవృత్తులు వేరు; వ్యవసాయయోగ్యమగు గ్రామగుడికట్టుభూమి, వంతులువారీగా పంచుకొని, యథేచ్ఛగా అనుభవించుట కనువున్న కాలమునాటి బుద్ధులొకతీరు. పండించినది కోసి నూర్చి యింట్లో వేసుకొన్నదాకానున్నూ, వండుకున్నది తిన్నదాకా నమ్మకములేని కాలమునాటి బుద్ధులు వేరైయుండుటలో ఆశ్చర్యమేముండును.

కొందరు గ్రామస్థులు నన్ను అడిగిన ప్రశ్నలకు జవాబుచెప్పి, వాటినే వోటరు క్యాండిడేటు సంవాద మను కరపత్రముగా నచ్చొత్తింపించి ప్రచురించినాను. ఇదిగాక, యింకా కొందరు కొందరు చిత్రవిచిత్రమైన ప్రశ్నల నడిగే వారు. వాటిలో ముఖ్యము లగువాటిని కొన్నిటి నిట వివరించి, యింతటితో యీ ప్రకరణమును ముగించుచున్నాను.

ప్రశ్న :—చాలమంది ఒకవైపున వున్నప్పుడు మీరొక్కరూ వెళ్లియేమి చేస్తారు ?

జవాబు :—మీరు యింటిల్లిపాదీ యాత్రవెళ్ళినప్పుడు మీ యింటిని జాగ్రతగా చూచుటకు ఒక్క కాపలావానిని వుంచి పోతారుగదా ? వాడు కాయగలడని నమ్మకము లేకపోతే, మీ యిల్లంతను వానిపై విడిచిపెట్టి పోతారా ? అట్టి విశ్వాసముతో బోర్డునందు మీకు సంబంధించినంతవరకు విమర్శింపబడే విషయాలలో నేను కాపలావుండి, తగుశ్రద్ధ తీసుకుంటాననే నమ్మకముంటేనే మీ వోటు నాకివ్వండి.

ప్ర:—ఈకాలములో బోర్డులంటె కలుషభూయిష్ఠములుగా వున్నవికదా? మీవంటి యోగ్యులు, దానిలో పదవి నపేక్షించు టెందుకు ?

జవాబు:—మాతండ్రిగారు నాకొకదివ్యభవంతి కట్టించియిచ్చి నారు. దానిలో నేను కాపురముండి, సుఖించుటకు బదులు అద్దెకుయిచ్చి, దానిమీదనుండి వచ్చు ఆదాయముతో జీవించవలెననే దుర్బుద్ధి పుట్టునది. అంతటితో నైనను తనవినందక, సంసారులకు అద్దెకు యిస్తే అద్దె యివ్వక పేచీపెట్టుతారనే సందేహముకలిగి, అడిగి నప్పుడు పేచీపెట్టకుండా, కోరిన అద్దె తక్షణం యిస్తారనే భ్రమతో వ్యభిచారిణులకు కాపురమున కిస్తానను కోండి. తదాదిదానికి గుడిశేటు కొంపని పేరురాక మానదు. దానికట్టి పేరురావడమునకు కారకుడను నేనా? యిల్లు కట్టినవాడా? యిల్లా? యిల్లూకాదూ. యిల్లుకట్టినవాడూ కాదు. నేనే. అట్లె దయామయులగు ప్రభుత్వమువారు ప్రజాసౌఖ్యముకొరకు, బోర్డులంటూ నెలకొల్పారు. వాటిని ప్రజాభ్యుదయము కొరకు వినియోగింపక పార్టీభృతికై వినియోగించుట కలవడిన నాటనుండియు, స్థానికసంస్థల కిట్లు చెడ్డపేరు కలిగినది. ఈతప్పు స్థానికసంస్థల నిర్మాతలదీగాదు. యెన్నుకొనబడిన మెంబర్లదీగాదు. అమాయకులగు వోటర్లదీ కాదు. స్వలాభ మపేక్షించి, వోటర్లను మభ్యపరచి, ముక్కుపచ్చలారనట్టియు, వ్యవహారజ్ఞానము లేనట్టియు, మాయోపాయములం దారితేరినట్టియు, దుష్టు

లకు, దుర్మార్గులకు వోటువేయించి, మెన్ను కొనబడుటకు అవకాశము కల్పించిన నాయకులది.

ఇత్యాది పశ్న లనేకములు గ్రామము లందలి ప్రజలు నన్నడిగేవారు. తడుముకోకుండా ప్రజలకు తృప్తికరమగు జవాబు సమయస్ఫూర్తిగా చెప్పేవాడను. వారికి నచ్చి నా యందు నిజమగు ప్రేమ కలిగినది. ఇది నేను వోటర్లలో కలిగించిన ప్రబోధను.

వోట్లువేయిస్తామనే బ్రోకర్ల మాయోపాయములు.

తాడేపల్లి గూడెం నాస్వగ్రామమేకదా! ప్రజలకు నాయందు పూర్తియగు విశ్వాసమున్నది గదా. ఇదిన్నిగాక, నాతమ్ముడు తాలూకాబోర్డుకు మెంబరుగా నుండుటకు దరఖాస్తు పెట్టినాడుగదా? వాడికివచ్చే వోట్లతోపాటు నా కెందుకురావు అనే ధైర్యముండేది. నా సోదరుని ప్రత్యర్థి అయిన కోడే నారయ్యా తాతగారికి నాకు యెట్టి పూర్వపరవైషమ్యములు లేనందునన్నూ, నేను చేసే ప్రయత్నమువల్ల తన కెట్టి పోటీలేనందుననున్నూ, వున్న వూరిమీద తన కెట్టి ఆశ వుంటుందో నాకున్నూ అట్టి ఆశయే ఉండునని భావించే తత్వము గలవాడగుటవల్లనున్నూ, అప్పుడప్పుడు మాప్రచారములో ఒకరికొకరు యెదురైనప్పుడు- మొదటిలోనే చెప్పారు కారు. యేచిక్కూ లేక పోవును అయినప్పటికి మీకు నేను

యేవిధముగాను అడ్డము రా ననే సానుభూతి వాక్యములు పలుకు చుండుట రివాజై నందుననున్నా, నేను నమ్మి యిక్కడ నా తఫురనపని జేయుటకు ప్రత్యేకబ్రోకర్ల నుయేర్పరుచు కొన లేదు-సరికదా పోలింగు రోజున యేజంట్లనైనను పెట్టుకొన లేదు. కాని, నాసోదరుడు కలిదిండి గంగరాజుగారిపార్టీకిలోబడి నాయెడ మూకీభావము వహిస్తాడనిగాని, కోడెనారయ్యా తాతగారు స్వార్థమునకు లోబడి యింట్లోవాని ముడ్డికాలు స్తాడని కాని నాహితము కోరినట్టియు, మాకుటుంబవృద్ధులని భావించినట్టియు, కలిదిండి శివరామరాజుగారికుమారునిచేత నాకు వోటుయివ్వవద్దని కలిదిండి గంగరాజుగారి సాయగుజస్తా పార్టీవారైన ఆలపాటి సుబ్బన్నచౌదరీగారి ప్రోత్సాహము పైన ప్రతిష్ఠింపబడిన శ్రీయుత వల్లూరి వెంకటదుర్గంగారికి వోటు యియ్యమని కాన్వాసు చేస్తారని కలలోనైనను నమ్మలేదు.

కడియెద్ద :—పోలింగు నాయకులు నన్నేమియు దగా చేయ లేదు. బ్రోకర్ల నెవ్వరిని నేను సమీపించ లేదు.

అప్పారావుపేట:—ఆగ్రామమునకు, లోతుగుండెగల నాయకు లిరువురున్నారు. వారిలో పెద్దాయనపేరు పోశ్ని వెంకట్రాయుడుగారు. రెండవ ఆయన పేరు పోశ్ని వెంకన్న గారు. వెంకట్రాయుడు అసలుమునసబు. వెంకన్నగారు ఆక్టింగు మునసబు. యెన్ని పర్యాయములు వీరిని

కలుసుకున్నా సానుభూతివాక్యములు చెప్పి సాగనంపడమేకాని, నే నుంటాను మీకే మీభయము లేదని ముఖతా అనలేదు. కాని నాతరపు అభిమానస్థులు కొందరు స్వయముగా యీసంధిగ్ధము తేల్చవలెనని వెళ్ళినపుడు, సరే నన్నారని అంటారు. వీరు కూడా పోశ్ని తమ్మయ్యగారి వెంకట్రాయుడుగారివలె చిట్ట చివరవరకు నీతికి నిలబడేవారే కాబోలుననుకున్నాను. వోటింగు ఫలితమును బట్టి చూడగా యెటూ చెప్పడమునకు వీలులేకుండా ప్రవర్తించి నట్లగుపించుతుంది. కాని వ్యతిరేకముగా పనిచేశినారనే నమ్మవలసి వుంటుంది. ఈముఠాలో ఒక పేర్కొనదగినబ్రోకరున్నాడు. ఈయనపేరు గార్లపాటి నారాయణస్వామిగారు. తాను యెరిగివున్న సంగతులను యేమీ యెరుగనట్లు నటించుటలో యింత ప్రవీణుడుండడని నానమ్మకము. ఇతరులకు వాగ్దానము చేయుటలో పాపమునకు వెరువని ధీరుడు. తన్నాశ్రయించ వచ్చినవారిని నమ్మించి, సాదరభావముతో సాగనంపుటలో చతురుడు. దస్తావేజులు వ్రాయడంలో అతినేర్పరి. సబురిజస్ట్రారు ఆఫీసులో యెన్నిగ్రామముల డైగ్లాటులుంటాయో అన్నీ వీరింటి యందుంటాయి. ఈ ముఠాలోయితనికి సంబంధము లేని వ్యాజ్యములేదు. ఈతడొక్కని కోర్టు

లేదు. మీ కేమీ ఫరవాలేదు మోకుగుంట ఉప్పర
గూడెం గొల్లగూడెం పుల్లాయిగూడెం వోట్లన్నీ
మీకే స్వయముగా దగ్గరఉండి వేయిస్తాను. మీరీ
వూళ్ళన్నీ తిరిగి శ్రమపడకండి అని బుర్రగుంజు తిని
పించి ఆశీర్వదించి సాగనంపాడు మహానుభావుడు. కాని
వోట్లువేయించినది నాప్రత్యర్థికి. తాను చేశిన వాగ్దాన
ములు, తన్ను కల్సుకొనుటకు నేనుపడినశ్రమ, నాతర
పున పనిచేయ వలసినదని శిఫార్సులు చేసినవారి
పేర్లు వోటింగు సమయమందు జ్ఞాపకం చేశినను
స్ఫురణకు రాలేదట. ప్రతిజ్ఞాభంగము చేయుట
లోను ఆడినమాటకు వ్యతిరేకముగా ప్రవర్తించుట
లోను యింతటిధీరుడు మరొకడుండడని నానమ్మకము.
తనజీవితములో ఇకముందెన్నడును, తన్నాశ్రయించ
వచ్చినవారలను, ఆశాపూరితులను గావించి, క్రియ
జరుగవలసి వచ్చేసరికి నిరాశాపూరితులను గావింప
వద్దని, నాసోదర సమానుడును మానవమాత్రుడును
అయిన నారాయణస్వామినాయుడుగారికి హితోప
దేశము జేయుచున్నాను.

నల్లజర్ల :—గుళ్ళపల్లి వెంకటశాస్త్రిగారు ఈయన నల్లజర్ల
కాపురస్తుడు. తనకుగల సాహిత్య జ్ఞానమును లౌక్య
ముతో సమ్మిళితముజేసి జీవించుచున్నాడు. పలుకుబడి

వున్నది. కార్యసాధకుడే. భవిష్యత్తును యోచించక నాకు సర్వవిధముల సహాయముచేస్తానని వాగ్దానము చేసినాడు. నాయందు ఆయనకుగల ప్రేమయును, ఆయనపనివాని తనమునందు నాకుగల విశ్వాసమునూ ఒకరి నొకరిసి నమ్మించి, తుదకు మోసపోవునట్లుచేసి నవి. దీనిని బట్టి వ్యక్తులలో ఒకరియందొకరి కుండే పరస్పర విశ్వాసములు, ప్రజాసమూహమును మర లించుటలో యెంతవరకు వినియోగించుననే విషయ మును తెన్నగా యోచించనిదే, యిటువంటి కాకతా ళీయమిత్రులపై నాధారపడి యుండుట ప్రమాద మనుపాఠము నింతవలన నేర్చుకొననగును.

దూబచర్ల :— తాతిన సీతారామయ్యగారు. ఈయన యువ కుడు; కిమ్మనవారు. కార్యవాదియేగాని యెటువీలుగా వుంటే అటు నావను నడుపించశక్తిగల యోధుడు. హరి దాసుడు వెంకటరత్నంగారూ, మీకు మాపోలింగు లలో నూటికి 25 వోట్లు తక్కువరావు. అందుకు నాది గ్యారంటీ. అటుపైన మీఅదృష్టము. అని కనపడ్డప్పు డల్లా ఖండితముగా అడుగనిదే పిలిచి చెప్పుతూయుండే వాడు కూడాను. ఈయన నా ప్రత్యర్థియగు అల్లూరి కృష్ణారావుగారి తరఫున పనిజేసేవాడు. నాతరఫున కాన్వాశింగుకు బయలుదేరుతానన్న, నాసోదరునితో

పడవల వ్యాపారములో జాయింటు వ్యాపారము చేయు చున్న, కైకరం కాపురస్థులగు అద్దేపల్లి పోతురాజుగారిని స్వయముగా దగ్గిరవుండి తీసుకొని రావలెననే బుద్ధి పుట్టి నేను కైకరంలోని పోతురాజుగారి యింటికి వెళ్ళేటప్పటికే లోపల గదిలో క్యాంపు కాటు పైన పరుండి మాట్లాడుచున్నాడు. నా అభిప్రాయము తెలిపిన పిమ్మట, పోతురాజుగారీయనకు నన్ను వప్పగించినారు. మాట్లాడవలసిన సంగతులు మాట్లాడినాము. ముందుగా నేను వెళ్ళివుంటాను. వెనుక నుంచి నన్నున్నూ పోతురాజుగారినిన్నీ కలసి రమ్మన్నాడు. తరువాత నేనున్నూ సీతారామయ్య గారున్నూ కలసి ఆరోజుననే బండిలో తాడేపల్లి గూడెం వచ్చినాము. దర్మిలాను, కలిదిండి గంగరాజు గారి పార్టీ తరఫున నిలిచిన, నాసోదరుడగు సుబ్బా రావుతో గదిలో గూర్చుని రహస్యాలోచన చేయు చుండగా నాకంటబడ్డాను. అప్పుడుకూడా, పూర్వము వలెనే హెచ్చరికగా మాట్లాడినారు గాని, యేమా త్రము తోణకలేదు. లేచి వెళ్ళబోయ్యే ముందు రేపు మీరున్నూ పోతురాజుగారున్నూ కలిసి తప్పకుండా రావాలి సుమా! అన్నారు. ఉత్తరప్రత్యుత్తరా లేమి జరిగాయో గాని, పోతురాజుగారు రాలేదు.

నేను యింకా యితరులతో కలిసి వెళ్లేటప్పటికి సీతారామయ్యగారు యింటివద్ద లేరు. దీనినిబట్టి అభిప్రాయం వేరు. ఆలోచన ఒకటి. ఈరెండింటికి సంబంధములేనిది నోటినుండి వెలువడేమాట. అని యిప్పటికి తెలిసినది నాకు. ఈపదవితో నాకు సామ్రాజ్యమురాదు. రాకపోయినందున నిత్యదరిద్రుడనుగాను. కాని, భూదేవి యిట్టి పుత్రరత్నములను యెంతబాధపడి భరించుచున్నదో అని మనస్సు పరిపరివిధముల యెగ్గించుచున్నది. అనంతపల్లిలోని ఉద్దగిరివారివలెను, కడియద్దలోని శీమకుర్తివారివలెను, కొమ్మగూడెంలోని వనింశెట్టివారివలెను దూబచర్లలో వంకడారివారినికూడా భగవంతుడు నావైపుకు మరల్పకపోతాడా అనుకున్నాను గాని, వారిని పట్టిన రాచగ్రహం పట్టువిడువకుండా చిట్టచివరవరకు అట్లే అంటిపెట్టుకొని యుంటుందనుకోలేదు.

ఘంటావారిగూడెం:— ఈప్రాంతములకు బ్రోకరు యలమర్తి వీరాస్వామిగారు. ఈయనకమ్మచౌదరి. యం. యల్. సి యలక్షనులో పెద్దిరాజుగారి తరఫున గంగరాజుగారి నంటియుండి, తమగ్రామమున కొన్నిస్కూలుబిల్డింగు సంపాదించినాడు. అప్పట్లో కావలసిన పని పూర్తి అయ్యేసరికి గోడలుమాత్రము లేచినవి. పైకప్పుకు,

సామానుకుమాత్రం డబ్బివ్వ లేదు. తాత్కాలికముగా, తాటివాసాలు వేశి ఆకునేశి కాలం గడుపుతూయు న్నారు. ఈలోపుగా యీ మెలకష్టన్ను వచ్చినవి. పిలి పించారు వీరాస్వామిగారిని. మామా ఏమిటంటే మామా ఏమిటన్నారు. పైకప్పు పూర్తిచేయించి సామాను శాంక్షను చేయిస్తామన్నారు. అల్లాగయితే వోట్లు వేయిస్తామన్నారు. సరే అంటెసరే అనుకుని దానితో యీయన గంగరాజుగారి తరపు బోకరుగా తయారైనాడు. నేనీయన నాశ్రియించివాను. ఈయన మాటకారి. చదువుకున్న వాడుకూడాను. తొలిసారి దర్శనముచేస్తే నామినేషనులునాడు వస్తాముకదా! అప్పుడు చూడాము లెండిఅన్నాడు. మరియొక పర్యా యము చూచేసరికి, ఆలపాటి సుబ్బన్న వోటుతిరిగిచేర కపోతే మీకే పనిచేస్తానన్నాడు. ఆఖరి పర్యాయము పాలకావిడి బుజనుమీద వేసుకొని రోడ్డుమీదనుం చునియుండగా అడిగితే మీప్రయత్నానికి అడ్డంరాను మీరుచేసుకొనే ప్రయత్న మేదో చేసుకోండి అనేస్థితి లోనికి మారింది. విజ్ఞానవంతులగు యిట్టివారికి మాట నిరుకు లేకపోవడమునకు కారణము, వారికుండే యీతిబాధలచేతనా? ఆశ్రయించిన వాని దురదృ ష్టమువల్లనా? కులతత్వమేమో అనుకొన్నను, ఒక

కులములోని వారే యిరువురు పెనుగులాడుచున్న పుడు నిజముగా సంఘాభిమానమే అపేక్షించిన వారైన యెడల ఒకరిని, వారించి రెండవవారికి సహాయపడ కూడదా? అట్టిదేదియు జరుగలేదుగాని యిట్టివిరిమాట దబ్బర. సంఘశ్రేయము నపేక్షించి కాదనుట నిర్వి వాదాంశము. సత్యవాక్య పరిపాలనకొఱకేమో అను కొన్నను, మొదట నాతరఫున పనిచేస్తామని తిరిగి నా ప్రత్యర్థితరఫున పనిచేయుటనుబట్టి అదికూడా కాదనుకొనుటకు సావకాశమున్నది. రెండూ కాక పోతే మరేమైయుండునా అని యోచించగా, యింకే మైయుండును? ఈయనను తిరుగదీసినది, అదే, అయి యుండునని స్ఫురించినది. ఇట్టి ప్రతితోలు కప్పుకొనిన వీరశిఖామణులగు నాయకులు, అష్టదిక్పాలురలాగున అన్ని మూలలందు కాసుకొని కూర్చుంటే వారి అను గ్రహముంటేనేకాని, వోటుబీరుపోతుందా? ఇకముందు ప్రయత్నించే వారెవరైనా, యేదిక్పాలున కేదిప్రీతో, ఆదానమిస్తేనేగాని, వారిఅనుగ్రహమునకు పాత్రులు కాలేరని గ్రహించి తదనుగుణ్యముగా వ్యవహ రింతురుగాక.

పోతవరం:—కొండేపాటి వల్లయ్యగారు. ఈయనగారిది, పోతవరం కాపురస్థలం. కమ్మవారు. చదువుకున్న

వాడేకాని, తగువులంటే ప్రీతిమెండు. ఈయనకు సంబంధములేని తగవులేదు. వాటిలో ముఖ్యముగు నవి, చాకలి తగవులు, మాలమాదిగల తగవులు. ఈయన, జిల్లాబోర్డు తరపున తాలూకాబోర్డు తరపున కంట్రాక్టరు. బహుశా చెక్కు లింకా రావలసియుండ వచ్చును. ఈయన కంట్రాక్టుల బాపతు సొమ్మేమైనా, జిల్లాబోర్డు వారుగాని, తాలూకాబోర్డుగాని, యివ్వ వలసివుంటే రాజుగారి పార్టీకి నమ్మకంగా పనిచేసిన బోర్డుగాన రాబోయ్యే జిల్లా తాలూకాబోర్డుల ప్రెసి డెంటులు, పిలిపించి వెంటనే వారికి ముట్టవలసియుండె మొత్తం యిప్పించివెయ్యమని నాప్రార్థన. ఈయనకు న్యాయా న్యాయములతో గాని ధర్మా ధర్మముల తోగాని నిమిత్తం లేదు. అన్నమాట ప్రకారం జరుగ వలసినదనే పట్టుదలగల మనిషి. ఇది యీతనినైజమో లేక ప్రెసిడెంటు లిద్దరి చేతిలోను తన జుట్టు చిక్కి యుండుటవల్ల యీ విధముగా ప్రవర్తించినాడో కాలపరిస్థితులే వ్యక్తపరుపగలవు. నేను నాలుగైదు పర్యాయము లీయనదర్శనము చేసాను. నా ప్రయత్న మునం దీయనకు సంపూర్ణసానుభూతి యున్నట్టునూ విధిలేక కట్టుబాట్లలోనుండి యీ విధముగా ప్రవర్తింప వలసినట్లు అతని ముఖచర్య వలన కనపడేది. తాను

పందెం కట్టిన పుంజే గెలుస్తుందను కొన్నాడు గాని, విపరీత పరిస్థితులు తటస్థిస్తే తన గతేమవునో, ఇంచుక ముందు వెనుక లాలోచించినాడు కాడని విచారించవలసి వచ్చుచున్నది. నే నాయనను సమీపించినప్పుడల్లా మీరు పూర్తిగా ఒక్కనికే సామ్రాజ్యం కట్ట ప్రయత్నించకండి. ఇంచుక ముందు వెనుక లాలోచించండి. పూర్తిగా కాకపోయినను, మీకు తోచినంత వరకు, నాఅర్హతను బట్టి సహాయము చేయమనికోరేవాడను. ఆఖరు పర్యాయము ఆయన దర్శనము చేసినప్పుడు, నాప్రియమిత్రుడొకడు చాటునకు బిలిచి ఆంతర్య మడిగితే, 50, 60 వరకైనా వేయిస్తాను లెండన్నారట. అల్ప సంతోషిని గనుక అంతే చాలు ననుకున్నాను. కాని యీవిధముగా వుల్టాసీదా పల్టీలు కొడతాడని నేననుకోలేదు. మాట మిగిలినది గాని, ఆయనకు సంక్రమించిన సామ్రాజ్యమూ లేదు. నాకు పోయే పిత్రార్జితమూ లేదు.

## గ్రామాధికార్లు, గ్రామంలోని వివిధపార్టీలు.

తాడేపల్లిగూడెం ఫిర్కాలోని గ్రామములలోని గ్రామాధికారు లందరిలోను, పురుషకారముగల మునసబు కరణములు, ఒక్కఅనంతపల్లి, తాడేపల్లిగూడెము, కొమ్ముగూడెం,

వీరంపాలెం గ్రామములలో తప్ప తదితర చోట్లలేరని నాఅనుభవమును బట్టి ఘంటాపథముగా చెప్పగలను. ఆడినమాట తప్పని వారీరెండు గ్రామములవారే. తాడిపిల్లి మునసబునకు రెండు నాలుక లున్నవి. కరణానికి మతేలేదు. వెంకట్రామన్న గూడెం కరణం ట్రేయూనియన్ ఆఫీసరు. కడియద్ద మునసబు అర్ధనారీశ్వరుడు. కరణం ఖండితవాది. ఆవుపాడు కరణం చలితేలువంటివాడు. మునసబాక అజగరం. నల్లజర్ల, దూబచర్ల చీపురుగూడెం, పోతవరం, పోతురెడ్డిపాలెంగ్రామాధికారులు ఒకరికొకరు తీసిపోరు. వీరందరిలోను పేరెన్నికగన్నవాడు కలియుగంధరుడు. పోతవరం కరణం కోగంటి పేర్రాజు శర్మగారు, పదిమంది వున్నప్పుడు మాట్లాడితే, ఆనుదొరకనిచ్చేవాడుకాడు. ఒంటరిగా మాట్లాడితే మనసిచ్చి మాట్లాడినట్లు నటించేవాడు. ఈవిధముగా ఒక్కొక్క గ్రామాధికారి కొక్కొక్క ప్రత్యేక గుణమున్నదిగాని గ్రంథవిస్తరభీతిచేత విపులముగా వివరింపదలచుకొనలేదు.

జవాబుదారీ వహించుటకు బాధ్యులగు గ్రామోద్యోగస్థులు, ఇట్టి విషయములలో తమ్మెవ్వరైనను సహాయమపేక్షించినప్పుడు, తమవల్ల యేదైన పని జరిగితే జరుగుతుందనిన్ని, జరుగకపోతే తమవల్లకాదనిన్ని నిర్భయముగా జెప్పుట శ్రేయస్కరముగాని, అట్లుగాక, మొగమాటమునకు సరే అంటూ యుండటం-తీరా, పనివచ్చినప్పుడు తెల్లమొగం

వేస్తూయుండటంవల్ల, యెలుకకు ప్రాణపోకడ పిల్లికి చెలగాటం వలె పరిణమించుటయేగాక తమ ప్రతిష్ఠకు చేటు తెచ్చిపెట్టు కొన్నవా రగుదు రనుట నిస్సందేహము.

ఒక్క పోతవరంలో తప్ప తదితరచోట్ల పార్టీ లేవియు వున్నట్లు కనుపించవు. దరిమిలా నైనైన పార్టీలు కల్పింపబడి నట్లగుపించినా అవిఅన్నియు, యీయెలక్షనులకొరకు కల్పింపబడి, యెలక్షను అయిపోవడంతోనే నశించిపోయా యనుకోవలసిన దే.

జమీందార్లు: ఇతర శ్రీమంతులుఆడే నాటకాలు.

మా ఫిర్కాలో గుండేపల్లి, తెలికిచర్ల, జమీందార్లున్నారు. వీరుగాక యింకా మొఖాసాదార్లు కూడా వున్నారు. ఇటువంటి యెలక్షనుల నాటకాలలో ముఖ్యపాత్రను స్వీకరించే వారు తెలికిచర్ల రాజాగారైన శ్రీ రాజా కాకర్లపూడి వెంకట రమణయ్య జమీందారుగారు. గుండేపల్లి వారైన శ్రీ మోతే జమీందారుగారుకూడజోక్యముపుచ్చుకొనుటకూడకలదుకాని యింతతీవ్రముగా నుండదు. నింతలో ఈయనదర్శనము చేయాలని నాహితముకోరిన వారు కొందరు నాకు హితోపదేశము చేసినారు. తొలిపర్యాయము శ్రీవారి దర్శనము చేశాను. హృదయపూర్వకమగు ఆతిథ్యమిచ్చినారు గాని, ఖండితమగు

వాక్కివ్వలేదు. ఆయన మిత్రులొకరు, తన్నాకట్టు వుంచినారు నిన్ని ఆయన కొద్దిరోజులలో తమగ్రామము ఈసందర్భము లోనే రానైయున్నట్టున్నూ ఆరోజున నన్ను కూడా రావలసిన దని కోరినారు. సరేనని తిరిగి యింటికి వచ్చినాను. ఆ తేదీ నాటికి ఆయన చెప్పినవారాగ్రామం వెళ్ళడం నాకు తెలుసును. కాని నేను వెంటాడించలేదు. నేను వెంటాడించక పోవుటకు కారణము ఆయన నాకు చూపిన ఆదరణను బట్టెన్ని నావంటి వాడిట్టి సంస్థలలో వుండవలసినదే, అని అన్నమాట ఆయన అంతరంగశుద్ధితో అన్నదే గదా అని నమ్మికచేతనున్నూ; తృప్తి జెంది వారి సందర్శనమువల్ల నాహృదయములో జనించిన ఆశాలతను త్రెంచ జూచానుగాని త్రెంచలేక పోయాను. అంతటితో అంకము ముగిసినది.

అటుతరువాత, ఆయన దివాను అయిన పెమ్మరాజు క్రిష్ణారావుపంతులుగారిని కల్సుకొనుటతటస్థించినది. మిత్రుల సమావేశసందర్శ మెట్లావున్నదీ అడిగితే మీాకేమిభయము లేదు. మీారు నిర్భయముగావుండండి. మీాకొచ్చిన భయ మేమీాలేదు. అంతా నిమ్మకాయవాటం చేశానని నమ్మబలికారు. కాగితాలు నెత్తిమీాదపెట్టుకొని ప్రమాణం చేసారుకూడాను. వీరితో యిట్టిసందర్భములలో తొలిపర్యాయ మగుటవల్ల నున్నూ, రాజాగారు అందరినీ సంతోషపెట్టజూచే తత్వాలని

తెలియనివాడ నగుటచేతనున్నూ, పవరాఫ్ అట్టర్నీ లేని దివానుగారికిన్నీ, నేతిబీరకాయవంటి నామమాత్రపు రాజా గారికిన్ని వుండే సంబంధబాంధవ్యాలు తెలియనివాడనగుట చేతనున్నూ, నేనున్నూ కొన్ని రోజులు దివాన్ గిరి చేసినవాడ నగుటవల్ల మారాజాగారిపై నాకెట్టిపలుకుబడి యుండేదో, యీయనకుకూడా అట్టివిశ్వాసముండియుండునని నేనమ్మకము చేత నున్నూ శ్రీవారివద్ద నామంత్రంపట్టిచ్చినదని విశ్వసించి ఉబ్బితబ్బిబ్బులూగినాను. పైగా యీదివానుగారు, మార్గమధ్యమం దెక్కడైనా యెదురుపడుట తటస్థించినప్పుడు మీకొలువు రెండువందలవోట్లు మూటగట్టి వుంచినాను. యెప్పుడుకోరితే అప్పుడు మూట విప్పిదులిపేస్తానని ఛలోక్తిగా పలుకుచూవుండేవాడు. రాజాగారికి నామీద యెంతఅనురాగంపుట్టకపోతే, యీయన యీవిధంగా తందనాలాడతాడనుకునేవాడను. కొంతకాలమైన తర్వాత, రాజాగారు మన విజయముకొలువు పాటువడి ప్రయత్నములుచేస్తూయున్నారనే వార్తలుచూచాయగా, సేవకుల ద్వారాను, ఇతర పరిచారకులవల్లనూ కర్ణాకర్ణిగా వినిపిస్తూయుండేదికూడాను. అంతటినుంచి నారొట్టె నేతిలోపడినదని నా నమ్మకము. మాతమ్ముడైతే, మావాడు ప్రతివానిని యిట్టె నమ్ముతాడని వేళాకోళం చేసేవాడు కాని రాజానుగ్రహం కలిగినదంటె చంకలెగురవెయ్యనివారెవరయినా వుంటారేమో చదువరులు చెప్పండి. నమ్మి మోసపోయినవాడుం టాడుం.

నమ్మక చెడిపోయినవాడూ వుంటాడు. నమ్మి మోసపోయిన వాడెప్పుడైనా తిరిగి కోలుకుంటాడుగాని, నమ్మక మోస పోయినవానికి కూడదీసుకొనుటకు సావకాశముండకపోతే ఉండక పోవచ్చును. ఈ రెండు రకాలుగాక నమ్మించి మోసము చేసేవా డింకొక డుంటాడు. వాడు మరుజన్మలో నక్కై పుట్టి చచ్చిన శవముల మాంసమును పీక్కుతినే గతి గలుగు తుందనే ప్రతీతి.

ఇదియునుగాక, నాలుకలు సత్పురుషున కొక్కటి, సర్పమునకు రెండు, బ్రహ్మదేవునకు నాలుగు, కుమారస్వామికి ఆరు, అగ్నిహోత్రునకు యేడు వుంటాయని లెక్క తేలింది. దుర్జనుని ముఖారవిందమందువలె నియమము లేకుండా మాట్లాడే ప్రతిమనిషికి వుంటాయని భావిస్తూయుంటే కార్య క్రమము నడిచేదెట్లు; కాబట్టి నమ్మవలసీ వుంటుంది. నమ్మకూడ నిదీ వుంటుంది. నమ్మించి మోసముచేసే వారువుంటారు. ఒకః మానవుడిట్టి పరిస్థితులలో తగుల్కొనుట, తగుల్కొనక తప్పించుకొనగలుగుట ఆయామానవుల గ్రహచారమును బట్టియుంటుందిగాని, బుద్ధి మాంద్యమూ చేతనైయుండదని నానమ్మకము.

సందర్భము లీ విధముగా పరిణమించినవని తెలిసి ఈ పర్యాయము శ్రీవారినియథోచితమర్యాదలతో బంధుమిత్రపరి వారాదులతో, రాజబంధువులు వెంటనంటిరాసందర్శించవలె

ననేకుతూహాలముపుట్టినది.కులవృద్ధులను వెంటబెట్టుకొన్నాను. రాజబంధువులను కల్పుకొన్నాను. వీరు గాక యింకను ఆప్త మిత్రపరివారాదులతో హోరున వర్షము కురుస్తూయుండగా రాత్రివేళ భోజనాల సమయానికి దివాణం దేవిడీగుమ్మంవద్ద బండ్లు దిగినాము. ఆసమయములో నడివీధిలో కాల్వలు వరదలై పారుతున్నాయి. మాహృదయాల్లో సంతోషతరంగా లుప్పొంగిపోతూయున్నాయి. ఎదురు సన్నాహాలు జరిగాయి. కుశలప్రశ్నలయినతర్వాత వచ్చిన కార్యము తెరగెరింగించి, భోజనభాజనాదులు నిర్వర్తించుకొనుటకు రాజబంధువులు తప్ప, తదితరులు యెవరి బసలకు వారు వెడలిపోయినాము. భోజనాలుచేసి, అగ్నిహోత్రాల అవశిష్టం తీర్చుకొని, తిరిగి దివాణం దేవిడీలో సమావేశమైనాము. మంత్రాంగవేత్తలు నావిన్నపము సహేతుకమైనదనిన్ని, రాజానుగ్రహముపొందుట కర్హతగలదనిన్ని తమ వచోనైపుణ్యముచేత సమర్థించి, సానుభూతి బడయుటకు సర్వవిధముల బాటుపడసాగిరి. ఈ లోపుగా రాజబంధువులు అంతఃపురములో సమావేశమై కర్తవ్యమేమిటా అని సమాలోచనలోనికి దిగిరి. దివానుగారు, మమ్ములను వెంటబెట్టుకొని, గ్రామములోని యితర పెద్దల సందర్శనము చేయించారు. దర్శించిన ప్రతిమానవుడును మీకంటె ముఖ్యలు మా కితరు లెవ్వరున్నారు. మీప్రయత్నము నకు తోడ్పడుట యనునది మాజన్మసాఫల్య మొనరించు

కొనుటయే. కాబట్టి మేము కంకణము కట్టుకొని మీాతరఫున పనిచేయుట కేవిధమైన అభ్యంతరము లేదని ఏకగ్రీవముగా అంతరంగశుద్ధిగా బలికినారు. ఇట్టి పరిస్థితులలో ఇవన్నియు విషపూరితపయోకుంభములని అనుమానపడుట కవకాశమెద్ది? గ్రామంలో కావలసిన పనిని నిర్వర్తించుకొని, తిరిగి దివాణం లో సమావేశమైనాము. రాజాగారు నన్నొకనిని మాత్రము తమ ఆంతరంగికుల సమావేశసభ కాహ్వానించినారు. శ్రీవారి ఆజ్ఞానువర్తినై, సముఖమున ఆసీనుడనై, వారివద నారవిందమునుండి, యేమి వెలువడునో అని చెవి యొగ్గి సావధానచిత్తుడనై వేచి యుంటిని. వారిలో వారేమి ఆలో చించు కున్నారో యేమిటో, తుదకు నాకిచ్చిన సలహా యేమిటంటే, మీాతరపున పని చేయుటకు మేము నిశ్చయించు కొన్నాము. కానిమేము స్వయముగా ఎదురుగుండా నిలువబడి పనిచేయుటకు కొన్ని యీాతిబాధలు మాకున్నవి. కాబట్టి మేము లేమనే ఆక్షేపణ లేకుండానున్నూ మీాకు కావల సిన పని జరిగేటట్టున్నూ మే మొక సలహా చెపుతాము వినుమన్నారు. చిత్తమన్నాను. మాకు ముఖ్యబంధువులైనట్టి, షట్టింపాలెం కాపురస్తులగు మ॥ రా॥ రా॥ దాట్ల వెంకట జోగీజగన్నాథనారాయణరాజు గారినిన్ని పెన్మెత్స జగన్నాథ రాజుగారినిన్నీ ప్రకాశరావుపాలెం పోలింగులో మీాతరపున యేజంట్లుగా పెట్టుకోండి. అటు తరువాత, మీాకు కావలసిన

పని వారు చేస్తారు. వెనుకనుండి నేను ముక్తాయిస్తూ వుంటా నన్నారు. సోదరులారా అనుమానపడుట కవకాశ మేము న్నదో మీరు చెప్పండి. అల్పసంతోషినిగనుక ఆనాటి నా సంతోషమునకు మేరలేకపోయినది. నా యీ వ్యూహము గోప్యముగా నుంచండిసుమా! మీపార్టీ వారీతోనైనను వెల్ల డించకుడు సుడీ! అని యిత్యాది కట్టుదిట్టపు వాక్యములెన్నో పలికినారు. నాటితో నాజన్మసాఫల్యమై తరించినదనుకున్నాను. ఈమాట విని యివతలకువచ్చిన తర్వాత, నామిత్రులు లోపల యేమి జరిగినదని నన్నునొక్కినొక్కి పృచ్ఛజేయ దొడిగిరి. లోపలజరిగినది లోపలనే వుంచమన్నారని శ్లేషార్థముగా జవాబిచ్చినాను. దానితో నామిత్రులుకూడా సంతుష్టాం తరంగులై చాలరాత్రియగుటవలన యెవరి ప్రక్కపై వారొరి గిరి. తెల్లవారినది. దివానుగారిదర్శనము చేశాను. ఆశీర్వ దించినారు. వారి ఆశీర్వాదము వితంతువుకు దండము పెడితే, నన్నుబోలి చిరకాలము జీవించుమని దీవించిన దంటారు. ఇది అటువంటిది కాదనుకొన్నాను. బ్రాహ్మ ణునకు దండము పెట్టితే మీబాబుతద్దిన మెప్పుడురా అని అడుగుతాడనే లోకోక్తి విన్నానుగాని, విష్ణుఅంశా సంభూతుడగు క్షత్రియపుంగవునకు గూడ యట్టి లోకోక్తి వర్తిస్తుందని నేను కలలోనైనను నమ్మలేదు. ఉసురలనైనను విడనాడుతాముగాని అప్రతిష్ఠలకు పాల్పడతాడా అను

కొన్నాను. ఇక గుమాస్తాపంతులుగారో, బ్రతికి సాధించాడు. చచ్చి సాధించాడనే కరణంవంటి వాడనుకొనుటకు వీడికీ వారికు యిదివరకేమైన పాతపగలున్నవి గనుకనా? వీరిరువురి ప్రవర్తనలుచూచి, యీకోటలో మనము పాగావేశినట్లే అని నిశ్చయించుకొని, ముందుకు సాగుటకు నిశ్చయించుకొని, శెలవు తీసుకొని పై మజిలీకి ప్రయాణము సాగించడాని కుద్యమించాము. మాఅభిప్రాయానుసారం, మాప్రయాణము సాగుటకు అవసరమగు సౌకర్యములు కల్పించినారు. ఎవరిగ్రామములకు వారు వెడలి పోయినాము. తుదకు వీరిరువురివలన నాకుజరిగిన సహాయమేమిటో చెపుతాను, సావధాన చిత్తులై వినండి.

మేమందరము, రాజాగారి గ్రామమగు తెలికిచర్ల పొలిమేర దాటినాము. రాజబంధువులు మాత్రము అక్కడనే నిలువ యున్నారు. మా వెనకనే కలిదిండి గంగరాజుగారు, తమతర్ఫున నిలువబెట్టిన వల్లూరి వెంకటదుర్గాప్రసాదరావు గారిని వెంటబెట్టుకొని, దివాణంలో దిగనారట. రాజాగారితో సంప్రతింపు లేమిజరిగాయో తెలియదు గాని, శ్రీవారిని వెంట బెట్టుకొని, శ్రీవారున్నూ శ్రీవారి బంధుమిత్ర పరివారాములు సహా గంగరాజుగారితో చుట్టుపట్ల గ్రామాదులు తిరిగి, చిట్ట చివరకు అనంతపల్లిలో మకాం చేశారట! ఈ గ్రామాలలో శ్రీవారు చేసిన ప్రచార మేమిటని దర్యాప్తు చాయగా,

సభలో కూర్చున్నప్పుడు, గంగరాజుగారి పార్టీ వారయిన, వల్లూరి వెంకటసుర్గాప్రసాదరావుగారికి వోటియ్యమన్నిన్నీ వోంటిరిగా వున్నప్పుడు వెంకటరత్నంగారికి వోటు చేయవలసిన దనిన్ని సలహా యిచ్చినట్లు తెలిసినది. రాజాగారు ద్విముఖములైనను, రాజబంధువులు మాత్రము ఏకతాటిమీదనే వున్నట్లు తెలిసినది.

ఎలక్షను తేది సమీపించినది రాజాగారి శెలవు ప్రకారం వారు చెప్పిన యిద్దరి ప్రముఖులకు నాతర్పున ప్రకాశ రావుపాలెంలో పోలింగు యేజంటు ఫారాలిచ్చినాను. నాతరపున ప్రకాశరావు పాలెంలో పోలింగు యేజంటులుగా నియోగింపబడ్డ వారి నివాసస్థానము పట్టెంపాలెం. వారు వోటు చేయవలసిన పోలింగుస్టేషను అప్పారావుపేట- వారు నా తరఫున, వోటింగు రోజున అప్పారావుపేటలో నుండ తలచి ఉండకపోవుటవలన, యెలక్షను రూల్సులో రూలు 24 A 10 ప్రకారం ల్డికవరులో బాలటుపేపరు పంపించుటకు వీలుండులాగున సర్టిఫై చేయించి, బాలటుపేపర్లు యిప్పించవలసినదని యెలక్షను ఆఫీసరుగారిని కోరుతూ దరఖాస్తులు వ్రాయించి సంతకాలు చేయించి పుచ్చుకున్నాను. ఆప్రకారం దరఖాస్తుచేసి, బాలటు పేపర్లును అడ్వాన్సుగా పుచ్చుకొన్నాను కూడాను. ఈకథ యిట్లున్నది. ఈలోపుగా యింకొక చిత్రము జరిగినది. 22-12-32 తేదీని పోలింగురోజు

21-11-32 తేది ఉదయం 10 గంటలకు పెన్మత్సరాజు కిృష్ణా రావుపంతులుగారు తెలికిచర్లనుండి తాడేపల్లిగూడెం మీాదుగా సంయికిలుమీాద, కలిదిండి గంగరాజుగారి నివాసస్థానమగు కేశవరంగా్రిమం వెళ్ళుచుండగా కనుపించినారు. ఎందాకానంటిని. శీ్రివారు గంగరాజుగారిని యేటు పనిజేయమన్నారో తెల్సుకొని రమ్మన్నారు. అందుకొఱకు, వెళ్ళుచున్నానన్నారు. వారు తిరిగి వచ్చినదాకా, యెక్కడకూ వెళ్ళకుండా, యేమివర్తమానం వస్తుందో అని నిరీక్షించుచుంటిని ఇంతలో దివాంజీగారు తిరిగివచ్చినారు. గంగరాజుగారేమి చెప్పారని అడుగగా వీలునుబట్టి వ్యవహరించమన్నారన్నారు. అదివరకు నామనస్సులోవుండే ఊహాననుసరించి, గంగరాజుగారి అభిపా్రియము మార్పుజెంది యుండుననిన్ని, అందువల్ల యిట్టి జవాబిచ్చి యుందురనిన్ని, యిట్టి వీరి సలహా కూడ నాకోరిక సిద్ధించుటకు అనుకూలముగా పరిణమించుననిన్ని భావించియుంటిని. ఈసందర్భములోనే, మీారు నా తర్పున పోలింగు యేజంటుగా వుండవలసినదని కోరగా జోగిరాజుగారు వగయిరా లున్నారుకదా! నేనెందుకు? అయినప్పటికి నే నక్కడనే యుంటాను గనుక మీాఅబ్బాయిని మాతి్రము అక్కడవుంచు. నాతోపాటే భోజనంచేస్తాడు. పెరుగు అదీ తెప్పించివుంచానన్నాడు. అక్కడికీ యీామాటలన్నీ నిజమేనా? లేక యిందులో దళారీయేమైనా వున్నదా? అని

కూడా అడిగినాను. అందుపైన, బాగావుందండోయి, మీ మొ డలనా అట్టిదుర్మార్గము అంటూ చెప్పారు. ఇవి జరిగిన సంగ తులు ఇట్టి సందర్భములలో సాటివాడు, అస్ఖలితబ్రహ్మ చారి, లౌకికధురంధరుడు, పరాన్నభుక్తుడు, పరగృహవాసి పర ద్రవ్యమును పాతబెల్లమువలె చప్పరించేవాడు, యిద్దరు మాట్లాడుకుంటూ యుండగా తనకుసంబంధము లేకపోయినప్పు టికి, తన్ను కోరనప్పటికి, చెవిని పడినంతమాత్రముచేత, ఎంతటి గట్టిపునాదుల నిర్మింపబడ్డ రాజకార్యమునైనను సునాయాస ముగా ఛేదించి, వికావికలు గావింపగల లౌకికప్రజ్ఞా విశేష ములుగల మహానుభావుడు. ఆడితప్పుతాడనిగాని, పలికిబొంకు తాడనిగాని, చేసేది ఒకటి చెప్పేది ఒకటి అయి యుంటుందని గాని, యెవరుభావిస్తారు?

ఈమాటలంటూ, నాకారుమీద ఆయనను ప్రకాశ రావుపాలెంవైపునకు తీసుకొనివస్తూయున్నాను. ఈలోపుగా యేదోకారు యెదురుపడినది. గంగరాజుగారి తరపున, రెండు బస్సులు కావలసియున్నది. మాట్లాడి బజానాయిచ్చి వస్తానని వెనుకకు వెళ్లినాడు. మళ్లి రాత్రినేను తిరిగివచ్చేటప్పటికి, ప్రకా శరావుపాలెంలోవంట బెత్తాయింపులలోవున్నాడు. అప్పుడు కూడాపలుకరించాను. వెంకటరత్నంగారూ మీకెందుకీ ఖం గారు. అన్నింటికీ మేమేవున్నాము. గుండెలమీద చెయ్యివేసు కుని, రాత్రి హాయగా నిద్రబోయి, వుదయాన్నే లేచిరండి

అన్నారు. ఆరాత్రియింటికి జేరి, తెల్లవారుజామున అబ్బాయిని వెంటబెట్టుకొని, బయలుదేరి పోలింగుస్టేషనులో, ఆపంతులు గారికి వప్పజెప్పినాను. నేనుయెగువపోలింగుస్టేషనులు చూచుకొని 10 గంటలయ్యే సరికి తిరిగి యిక్కడకు వచ్చినాను.

మహారాజశ్రీ గారెక్కడా కనుపించరే నాయనా! క్రిష్ణారావు గారేరంటిని. అప్పుడే వెళిపోయెను నాన్నా అన్నాడు. నడుము లటుక్కుమన్నది. లోపలి నుండి బయటికి వస్తిని. జోగిరాజుగారు తాతంరాజుగారు తెల్లమొఖంవేసి తిరిగిపోయిదంన్నారు. రాజాగారేమన్నారంటిని. అప్పుడు మనతో అన్నదొకటి యిప్పుడు వారు నడిపించే విధానము వేరుగా వున్నదన్నారు. ఇప్పుడు మనము చేయవలసిన దేమిటిఅన్నాను. ఇంకేమున్నది. యేజంటుగిరి వదలుకొని మేము యింటికి వెళ్ళుతాము. యీపోలింగులో ఆశవదలుకొని మీరింకొకచోట తంటాలుపడమన్నారు. ఈయనను నమ్మినందుకు నాకు ప్రాయశ్చిత్తమున్నూ వారిమాటనమ్మి యేజంటుగా తగుదునంటూ తయారైనందుకు మీకు కావలసిన పరాభవమున్నూ అయినది. కాబట్టి యెవరిత్రోవను వారు వెనుకకు మరలు దామనుకున్నాము. అంతే చేశాము కూడాను.

అటు తర్వాత దర్యాప్తు చేస్తే ఈ రాజాగారికి ఈ విధంగా తన్నాశ్రయించ వచ్చిన వారిని నమ్మించి మోసము

చేస్తూయుండడము మూడు యలక్షనులనుంచి రివాజే అనిన్ని ఇది క్రొత్త కాదనిన్ని, కొంతమందికి తనకు హక్కు లేనిదే భూములు పట్టాలు యిస్తూయుండటం వాటిని అమ్మిస్తూ యుండటం, అట్టి భూములు కొనుక్కొన్న వాళ్ళు చార్జీలు యిస్తూ యుంటే, చేతులు కట్టుకొని క్రిమినల్ కోర్టులవెంట తిరుగుతూ యుండటం రివాజే అనిన్ని ఈ యస్టేటు యీయన పెద్దకుమారునిదేగాని ఈయనకు హక్కు లేదనిన్ని, ఈయస్టేటు మీద ఆదాయమును హామీగా వుంచుకొని, కాసుపాడు రాజులు యిచ్చిన బదులుసొమ్ముకు వాయిదాల వెంబడిని వసూలు యిచ్చుటకు యేర్పర్చుకున్న మొత్తంపోను మిగతా దేమైనా నిల్వయుండేయెడల దానినే యీయన తన జీవిత భృతిగా వినియోగించుకోవలసిదేగాని, యీయనకుగల జమీా పైనగాని, దానినుండి వచ్చు ఆదాయముపైనగాని యెట్టి స్వాతంత్ర్యముగాని లేదనిన్ని తెలిసినది. ఈయన నెత్తి మీాదను వున్న వెంట్రుకల సంఖ్యను మించినన్ని ఋణబాధలు యితర యీతిబాధలు యీయనను కట్టుబాట్లలో బిగించియుంచినవి గదా ! అట్టివాడు బహిరంగముగా వచ్చి నీకెట్లు సహాయ పడునని నమ్మితివని కొందరు కూకలేశారుకూడాను.

అటుతర్వాత యీయన దివానుగారైన మ॥రా॥ పెమ్మరాజు కృష్ణారావుపంతులుగారిని గురించి దర్యాప్తు చేయగా, ఈయన పగలు ఉద్యోగము తెలికిచర్లలో. రాత్రిలు

పడక తాడేపల్లి గూడెంలో. మధ్యాహ్నం భోజనం బలిజే పల్లి సాంబయ్యగారియింటిలో. ఈయన దివానూ కాడు. తాణే దారూ కాడట. వ్యాజ్యాల గుమాస్తాయట. మూడుపర్యాయములు మాని వేసి, మూడుపర్యాయములు ప్రవేశించినాడట. ఉద్యోగంలో వుంటే శ్రీవారి వ్యాజ్యాలు నడుపుతూయుండటం. ఉద్యోగంలో లేకపోతే శ్రీవారిమీదచార్జీలుయిప్పిస్తూ యుండటం యీయన చేసే పని అట. కాచి పొయ్యడానికి భార్య లేదు. తలదాచుకొనుటకు కొంప లేదు. తెచ్చినచోట యివ్వడం లేదు. ఇచ్చినచోట అడగడం లేదు. పరవిత్తం పాతబెల్లంలాగున చూస్తూ స్వార్థమేగాని పరార్థమనున దేకోశమందును లేకుండా జీవయాత్ర గడుపువాడని తెలిసినది. ఈ విషయంలో ఈయన యీవిధముగా చేశాడనటంతోనే, వీడి కడుపుబంగారముకాను. వీడు నీకెక్కడ దొరికాడయ్యా బాబూ అనేవాడే కాని, రాజాగారు యెల్లా బడితే అల్లానడిచే వాడేగాని, వాడేమిచేస్తాడు పాపము అనే వాడొకడూ కనుపించలేదు. రాజాగారివద్దిలో వుండేవాడు కదా! ఆయనచెప్పినదే వీడు ముఖ్యభావము వహిస్తాడా అనుకొనుటకు కూడ అవకాశము లేదు. యెందువల్ల ననగా, రాజాగారివద్ద వుద్యోగముచేసి మానిపించడంతోనే వానిమీద చార్జీలు యిప్పించి క్రిమినల్ కోర్టులకు యీడ్పించిన వాడెంతటివాడైనా సమర్థుడే అనుకొనుటకు కూడ సావకాశమున్నది.

అవశిష్టాలన్నీ తీరినతర్వాత, పంతులుగారు పెంట పాడులో దర్శనమిచ్చారు. యేమి పంతులుగారూ! నాగతి యీవిధముగా కాల్చారు అని అడిగితే, నా తప్పేమియును లేదు. పెద్దబాబుగారు నాకు వర్తమానంచేసి, నన్ను అక్కడ వుండవద్దనిన్నీ, తాడేపల్లిగూడెం వెళ్ళి యెవరికి కనుపించ కుండా, ముసుగుపెట్టుకొని నిద్దదన్ని పడుకోమన్నారు. నేను ఆప్రకారమే చేసినాను. నాతప్పేమిటన్నారు.

ఇది రాజాగారున్నూ, దివానుగారున్నూ ఆడిననాటకం. ఇకముందెన్నడును, నావంటి వెర్రిబాగులవాండ్లు యిట్టి నాటకాలకు భ్రమపడి, మోసపోకుండుటకై యీ వివరము వ్రాయ వలసి వచ్చినది.

ఇకముందెప్పుడైనా యిట్టిసందర్భములలో తన్నెవరయినా, సహాయము కోరినప్పుడు తననిజస్థితిని వెల్లడిస్తూ, తనకుండే యీతిబాధలను వివరిస్తూ, తనసహాయ సంపత్తెంత, వరకు సహాయపడగలవో స్పష్టముగా వ్యక్తీకరిస్తూ తనమాట దబ్బరవోనీక తన్నాశ్రయించి వచ్చినవారిని మోసపుచ్చుటకు పుచ్చులు పన్నక, తనపూర్వాపరప్రతిష్ఠలకు భంగము రానీయక, వున్నదివున్నట్లుచెప్పి, చెప్పినంతచేసి, తన ప్రతిష్ఠను యినుమడింపజేసుకుంటూ యెదుటివారి మర్యాదకు లోటురాకుండే పద్ధతిని ప్రవర్తింతురని విశ్వసించి, శ్రీరాజావారికి- హృదయపూర్వకమగు హితోపదేశమును జేయుచున్నాను.

## సుజనులు : నీతికి నిలువబడినవారు.

తాను బాధపడియైనను పరోపకారము చేయ జూచువాడే సత్పురుషుడు. అగరుపుల్ల కాలుచున్నను, తన్ను కాల్చినవానికి సువాసన యిచ్చుచున్నది. మంచిగంధంచెట్టు నఱికబడియు, తన్ను నరుఱట కుపయోగపడిన గొడ్డలికి సుగంధమలముచున్నది. ఆవునకు గడ్డివేస్తే పాల నిచ్చుచున్నది. కష్టపడి కుండెడు నీటిని తెచ్చి కొబ్బరిచెట్టుకు పోస్తే, తన్నాదరించిన వానికి, వాని కుటుంబమునకు అమృతతుల్యమగు పానీయము నిచ్చుచున్నది. సూర్యభగవానుడు తాను శుష్కింపజేసిన జలరాసులను తనయందే యిమిడ్చి యుంచుకొనక, తిరిగి పూరించుచున్నాడు. ఈశ్వరుడు, చంద్రుని, విషమును గూడ గ్రహించి, చంద్రుని శిరస్సునందును, విషమును కంఠమునందును వుంచుకొనినట్లు, సత్పురుషుడు గుణదోషములను గ్రహించి గుణమును శ్లాఘించుచు, దోషమును కంఠమునందుంచుకొనుచుండును. మంచి నీటియందలి బంగారమువలె మునిగిపోయి అడగియుండును. చెడుగు నీటియందలి తైలమువలె వ్యాప్తినొందుట సహజము. ఈరాని పదార్థములను యిచ్చినవారే మహాత్ములు నా బరగుదురు. ఎట్లన కర్ణుడు తన శరీరమునందలి కవచమును యిచ్చినాడు. శిబిచక్రవర్తి తన శరీరమందలి మాంసమును యిచ్చినాడు. ఇంద్రుడు జీవమును యిచ్చియున్నాడు. దధీచిమహాముని తన యెముకలను

ధారవోసినాడు. నీతిజ్ఞులు నిందింపనీ, స్తుతిచేయనీ, లక్ష్మిరానీ పోనీ మరణము అప్పుడే కలుగనీ, లేక యుగాంతమునందుకలుగనీ, న్యాయమార్గమునుండి తప్పరు. ఆడినమాట ప్రకారం జరిపితీరుదురు. ఇట్టివారే ధీరోదాత్తులు నా బరగుదురు. చిలుకలు కట్టివేయబడి కాకులు స్వేచ్ఛగా సంచరించుటెట్లో అట్లే గుణవంతులు కష్టపడుటయు గుణరహితులు సుఖమనుభవించుచుండుటయు యుగధర్మమై యలరారుచున్నది. నా ఎలక్షను ప్రచారములో నాకు సర్వవిధముల సహాయపడినవారు చాలమంది యున్నారుగాని, అందులో ప్రాముఖ్యత గన్నవారు వైశ్యులు. అటుతరువాత కాపులు. కమ్మవారిలో పూర్తిగా కాకపోయినను కొంతవరకైనను చేయూతనిచ్చినవారు కలరు. కోమట్లలో ఆదినుండి చివరవరకు ఒకే విధముగా నున్నవారు, అనంతపిల్లిలోని, ఉద్దగిరివారు. అటు తర్వాత, నన్ను వెంటబెట్టుకొని, గ్రామగ్రామమునకు ఊరేగించినవారు కొమ్ముగూడెము లోని వసింశెట్టివారు. వోటింగు సమయములో నడుము కట్టుకొని, నీకా నాకా అని నిలువబడినవారు శీమకుర్తివారు. క్షత్రియులలో పట్టింపాలెంవారు ముభావము వహించినారు. వీరంపాలెంవారు వెల్లడికాలేదు కాని చెయ్యవలసినపని చేసారు. తాడేపల్లిగూడెంవారు వీధిబడి విరుగబడ్డారు. వీరందరిలోను ఘనులు తెలికిచర్లవారని చెప్పనొప్పును. నమ్మించి మోసము చేయుటలో యింత

నేర్పరు లీతాలూకా మొత్తముమీద నుండెరని నా అభిప్రాయము. బ్రాహ్మణులలో నావిషయములలో కంకణము కట్టుకొని, యిటున్న సూర్యు డటు తిరిగినా, పట్టపగలు చుక్కలు పొడిచినా, చలించకుండా సవ్యసాచివలె పని చేసినది, అనంతపల్లిలోని మంచిరాజువారున్నూ, కడియద్ద కొమ్మూగూడెములోని తల్లాప్రగడవారున్నూ, తుమ్మలపల్లి వారున్నూ, తదితరు లందరున్నూ పొట్టే చూచుకున్నారు గాని ప్రతిష్ఠకు ప్రాకులాడలేదు. కాపులలో కథానాయకుడు పోకల గంగరాజుగారు. ఈ మహామహుడు పోలింగు మొదలు పెట్టెవరకు, ప్రాణము తహతహ లాడించినప్పటికి, చిట్టచివరకు అన్నమాట ప్రకారం ఆచరించాడు. నాప్రచారము వలన వాకు ఫలితము చేకూరక పోయినప్పటికి ధర్మబద్ధముగు నా యత్నమునకు అడ్డము తగిలిన వారని పాడుజేయుటకు పనికి వచ్చినది. అప్పారావుపేటలోని పోశ్ని తమ్మయ్యగారి వెంకట్రాయుడుగారివంటి వాడున్నూ, నల్లజర్లలో మేదర కులస్థుడగు పాతకోట రామస్వామివంటి వాడున్నూ, యింకొక్కరు ఉంటే నాగతి యీవిధముగా పరిణమించదని నేను నిశ్చయముగా చెప్పగలను.

## దుర్జనుల స్వభావము.

అవినీతిపరు లిచ్చే అభయహస్తాలపై నాధార పడి ప్రయత్నించుట కంటె అవివేకము మరొకటుండదు. వీరి అభ

యహాస్త్రాలు, వాగ్దానాలు, నీటి మీాది అక్షరాలవంటివి. వీరిమాటలపై నాధారపడి వ్యూహములు పన్న జూచుట గాలిలో మేడలుగట్ట నుద్యమించుట వలె నుండును. ఆను తెలియని మనుష్యుల అసరా చూచుకుని ఎలక్షనులలో నెగ్గ గలుగుదు ననుకొనేది కుక్క తోక పట్టుకొని గోదావరి ఈది నట్లుంటుంది. అజ్ఞానితో కలహము పెట్టుకొనినను ప్రమాద ముండక పోవచ్చునుగాని, మూర్ఖుల మైత్రి పై నాధారపడి యుండుట అన్ని విధములా అనర్థమే. ధర్మోపదేశములు చేసే పాండిత్యము ప్రతివానికి వుండుట సహజము. అనుష్ఠించే పాండిత్యము సత్పురుషు యందేగాని అందరియందు నుండదు. అందువలన ధర్మోపదేశములను చేయుట వినుతిగాంచినాడ న్నంత మాత్రముచేత, వాని మాటలనునమ్మి యేకార్యమును సాధింపగల మనే నమ్మకముతో నుండకూడదు. దుర్జనుడు కాకివంటివాడు. పంచభక్ష్యపరమాన్నము లారగింప జేసినను అమేధ్యము తిననిదే యెట్లుపంది తృప్తినొందదో, అట్లేదుర్జనుడు తన్నెన్ని విధముల చేత ఆరాధించినను రక్షించుమన్న వానిని భక్షించుటెట్లా యనునదే అతని యీాప్సితమై యుండుట నైజము. సజ్జనుల సదుద్యముల కంతరాయములు కల్పింపజూచుటయే దుర్జనుని ముఖ్యోద్దేశము. ఎన్ని పర్యా యములు మట్టితో కడిగినను, ముడ్డి మొకముగా యెట్లు కాదో, అట్లే యెన్నివుపకారములను చేసినమైనను దుర్జనుని

సుజనునిగా జేయశక్యముకాదు. దుర్జనుడు శిష్టాచారునివలె కన్పించుట, పెద్దపులి పురవాసము చేయుటవంటిదే. సూర్య రశ్మికంటె, సూర్యరశ్మివలన కాలినయిసుక యెక్కువ వేడిగా నుంటుంది. అల్లే, అసలు అధికారికంటె, వానిద్వారా అధి కారము పొందిన నీచుడు, తన కధికారము ప్రసాదించిన వాని కంటె అధికముగా బాధపెట్టువాడై యుండుట సహజము. అన్నపుముద్దయందు ఈగ దగులుకొని, దానిని మ్రింగిన వాని చేత తిరిగి కక్కించునట్లు దుర్జనుడు తనప్రాణములు పోగొట్టుకొనియైనను పరుల కార్యమును భంగపరుప జూచు చుండును. కుక్కతోక, యెన్నిబద్దలతో కట్టినను వంకరతీరనట్లు దుర్జనుల మనస్సు యెన్నివిధముల బోధింపబడినను సాత్త్విక వృత్తికిమారదు. విద్య, అధికారము గలవారు విపరీతస్వభా ముగలవారగుదురేని, అట్టివారిని కలియుగరాక్షసులని పేర్కొనుటకేమియు సందేహములేదు. దుర్జనుడు బొగ్గువంటి వాడు. నిప్పుతోవుంటె కాలుతుంది; చల్లారివుంటే మసి అవు తుంది. సంతుష్టాంతరంగులగు సత్పురుషులకు అకారణశత్రువు లెవరనిన, అట్టివారి సదుద్యమముల కడ్డుతగులు దుర్జనులు. పరదూషణయనిన వీరి కపరిమితానందము. పరరంధ్రాన్వేషణ యందు వీరికి ప్రీతి మెండు. సజ్జనులకు మానమే ధనము. సజ్జనుల మానధనాపహరణమనిన దుర్జనుల కాపేక్షమెండు. దుర్జనుని సహవాసము మట్టికుండవంటిది. మట్టికుండ

పగిలితే అతుకదు. తనవలె సత్యవాదియని దుర్జనుని నెవడు నమ్మినో వాడు తప్పక మోసపోవును.

దర్వ్యబలము, సరస్వతిప్రసన్నత, రాజసము.

నేను అభ్యర్థించిన స్థానమునకు మరియిద్దరు పోటీ దార్లు పోటీచేసినారు. వారిద్దరును కమ్మవారు. మాముగ్గిరి లోను ఒకడు లక్ష్మీపుత్రుడు. రెండవవాడు సరస్వతీప్రస న్నుడు. మూడవవాడు రాజసుడు. లక్ష్మీపుత్రుడు లక్ష్మిని చెల్లాచెదరుగా వెదజల్లినాడు. సరస్వతీప్రసన్నుడు విజ్ఞాన మును డొంకలంట తీగపాకించాడు. రాజసుడు మనకు రాజా దరణమున్నది గదా యని మీసాలు దువ్వి యెక్కడకు పోతావురాయని ప్రతివాడినీ చూచి తొడలు కొట్టేవాడు. లక్ష్మీపుత్రుడు వోటరుల కొరకు పలుకుబడి గలనాయకులను సమీపించి మీతాలూకు వోట్లు నాకిప్పించమని అడిగేవాడు కాని యితరులకు యివ్వవద్దని చెప్పేవాడుకాడు. సరస్వతీ ప్రసన్నుడు వారివారి నిజరూపములను చిత్రించి వున్నదున్నట్లు చూపించి మాముగ్గురిలోను యిష్టమువచ్చినవారి నెన్ను కోండి అని చెప్పేవాడు. రాజసు డట్లుగాక, ఒకడు నాయడు పార్టీ అనిన్ని రెండవవాడు వోటు అమ్మకొనేవాడనిన్నీ, తాను మాత్రము న్యాయమునకు కట్టుబడి తన్ను నిలువబెట్టి నట్టియు తనతరఫున డిపాజిట్టు కట్టినట్టియు తనవిజయము కొఱకు పాటుపడిన పార్టీకి మాత్రమె వోటుచేస్తానని తన

ప్రచారంసాగించేవాడు.తన పార్టీకి మెజార్టి లేనిచో తనవోటు యేమిచేస్తాడో చెప్పేవాడుకాడు. అడిగేవాళ్లకు అట్టి ప్రాజ్ఞత వుండేదికాదు-విపులముగా డబ్బున్నదికదా! మనమెందుకు తగ్గలేమనే ధైర్యం ఒకటికి- దైవమునే నమ్మి దైవముఖము చూచి మనము పనిచేయుచున్నాముకదా! పరమేశ్వరుడు మన కెందుకు సహాయచేయ డని ఒకడికి. పైకాపులన్ని పెట్టు కున్నాము. పైగా రాజుగారు మనలను కంటిని రెప్పవలె కాస్తు న్నారు కదా! ఏమూలజూచినా, నాబంధువులేకదా! నాకేమి కొదువఅనుకున్నాడు రాజసుడు. ఒకడిది బాలనాయకం. రెండవ వాడిది బహునాయకత్వం. ఇంకొకడిది నిశ్చలతత్వం. ఈ విధ ముగా మూడుతత్వాలు మూడువైపుల గజ్జెలుకట్టుకుని గంతులు వేశినవి. కలియుగము గనుక చివరకు లక్ష్మీపుత్రుని గంతే తాళంతో లయ కుదిరి, రక్తికట్టింది- ఎదిరి రాజసని నృత్యం రక్తి కట్టింది అటుతర్వాత చాన్సు లక్ష్మిదైనది. ఇక ముందెటుల పరిణమించనున్నదో చదువరు లూహింతురుగాక.

## వోటింగురోజున పోలింగుస్టేషనులవద్ద జరిగేగమ్మతులు.

మాఫిర్కాలో పోలింగుస్టేషను లేర్పాటుచేసారు. 400 వోట్లకొక పోలింగుస్టేషను వుండవలెననే యేర్పాటులు. ప్రతిపోలింగుస్టేషనులో క్యాండిడేటునకొక యేజంటుచొప్పున ప్రవేశించుట కనుమతిస్తారట- నేను అనంతపల్లి పోలింగు

స్టేషనువద్దనుంచి బయలుదేరాను. అక్కడ ఒక పోలింగు ఆఫీసరున్నూ ఆయనకొక అసిస్టెంటున్నూ వున్నారు. ఒక చిన్నగదిలో కొంతప్రదేశ మందొక తడికి అడ్డముగా కట్టినారు. దానిపేరు "బూతు" అట. సరిగాఉదయం 6 గంటలయ్యే సరికి పోలింగు ఆఫీసరున్నూ వారి అసిస్టెంటున్నూ తమకై వేసియుంచిన కుర్చీలపైన ముందు ఒకటేబిలు అమర్చుకొని కూర్చున్నారు. అటుపైన వోట్లువేయుటకు వారికిచ్చిన పెట్టెలు తెరచి, అందులో యేమీ లేవని అందరికి దులిపి చూపించి, వాటికి తాళము లమర్చి శీలుచేసినారు. తర్వాత ఆఫీసు వెలుపలను, లోపలను, బూతని ప్రత్యేకింపబడిన ప్రదేశములోను, కాగితములు వ్రేలాడగట్టినారు. అటుపిమ్మట కాండిడేటుల పేర్లు పిలిచి, యేజెం ట్లెవరని అడిగినారు, ఆయా క్యాండిడేట్ల తరఫున యేజంట్లు, తమతమ అధికారపత్రములను దాఖలు చేసినారు. వోటర్లు ఒకరివెంబడి నొకరు చేతితో తమ నెంబరు గల చీటీనొకదానిని పుచ్చుకొని పోలింగు ఆఫీసరును సమీపింప సాగిరి. నంబరు ప్రకారం పేరు పిలుస్తూయుంటే, ఆపేరుగల మనిషిని నేనే అనుటతోడనే నీవోటు యెవరికిస్తావు అని అడగటం, చదువురాదు అంటే, పోలింగుఆఫీసరేమార్కు చేయడం. చదువువచ్చును, నేనేమార్కు చేస్తానంటే, కాగితము యిచ్చి లోపలికివెళ్ళి మార్కుచేసి పట్టుకొనివచ్చి తనకు చూపించి, పెట్టెలో వెయ్యమనడం. ఇదీ అక్కడ జరిగినతంతు.

అక్కడనుంచి యింకొక చోటికి బయలుదేరాను. వోట్లువేసే వారంతా ఒకచోట గుమిగూడియున్నారు. వాండ్లకొక నాయకుడు, తాను వేయించదలచుకున్న క్యాండిడేటు పేరు బడిపెట్టి చెప్పుతున్నాడు. నోరు తిరుగక, రావు అనుట రాజు అని చెప్పుతూయుంటే, పోలింగు ఆఫీసరు యిన్‌వాలిడు చేస్తానని డబాయిస్తూయుంటే, మిమ్ములను కోరి వేయించుకొనడం యిట్టిసౌకర్యముకొరకే సుమండీ అని జ్ఞాపకంచేస్తూయున్నాడు యేజంటు. అటుతర్వాత ఆబోరికరే యింకొక వోటరును పిలిచి, నీపేరెవరు? నీయింటిపేరెవరు? అని అడుగుతాడు. నీఅసలు పేరు యింటిపేరు చెప్పక మీారు పిలిచినదే నాపేరని చెప్పమంటూయున్నాడు. బాబూ! పేరు గానిదే, నాపేరని చెబితే యేమీాతంటూరాదుగదా? అని అడిగితే, కాదనేవారెవరా? మునసబు కరణం మనవాళ్ళేకదా? నీకేమి భయములేదు అని హెచ్చరికచేస్తూయున్నాడు. స్వయముగా చూచాను. విన్నాను. కాని తగాయిదాపెట్టితే రుజువు పర్చుటెట్లాగా అనే సందేహం కలిగినది. లాభం లేదని మరలి పోయాను.

తర్వాత మూడోస్టేషనుకు తరలాను. ఇక అక్కడ భాగోతం యెల్లావుందంటే: గది చిన్నది. వరండా యిరుకు. పోలీసు బందోబస్తు తక్కువ. అక్కడున్నవారంతా ఒక క్యాండిడేటు తాలూకే. రెండోమనిషికిగాని, ప్రత్యర్థికి వోటు

వేసే వానికి గాని చోటివ్వడము లేదు. పై వాడెవరైనా మాట లాడితె దెబ్బలాటకి సిద్ధం. వారి తరఫు క్యాండిడేటుకు వోటు వేసేవా డయితే తోసైమంటే తోసివెయ్యమనడం. వ్యతిరేక పార్టీవాడికి వోటువేసేవాడైతే వుండుమంటే యుండటం. చుట్టూ మూగినవాండ్లు పోలింగుఆఫీసరుకు వూపిరాడనీయటం లేదు. అల్పాచమానానికైనా బయటికి రానీయడంలేదు. పోలింగురూముకు ఒకగుమ్మమేగాని రెండోగుమ్మము లేదు. బయటికి పోదామనినను సునాయాసముగా వీలుండదు. ఆగదిలో ఆయన యెల్లావున్నాడంటే శివాలయం గర్భగుడి యందున్న లింగమూర్తిలా గున్నాడు. ఈస్థితి అంతా చూచినాను. ఇక్కడ మన మొక్కనిమిష ముండకూడదని గిరున మరలాను.

అక్కడనుంచి నాలుగోచోటికి వెళ్ళుదామని బుద్ధి పుట్టింది. వెళ్ళాను. అక్కడ జరుగుతూయున్న అల్లరి యేమిటంటే, ఆస్టేషనులో యిద్దరు క్యాండిడేటులు ఖుద్దున హాజరుగా వున్నారు. ఒకడు చదువుకున్నవాడు. రెండవవాడిది మోటతోపు. చదువుకున్నవాడు యెలక్షను రూల్సుచేతితో పట్టుకున్నాడు. రెండవవాడు దుడ్డుగఱ్ఱ చేతితో పట్టుకొన్నాడు. ఒకడు రూల్సుప్రకారం పని జరగటంలేదని పేచీపెట్టుతూయుంటే, రెండవవాడు కఱ్ఱయెత్తుతూయుండటం. వీరితంతు జూస్తే పోలింగు ఆఫీసరుకు ఖంగారుపుట్టి కలం ఆడక పోవడం.

సంగతి సందర్భాలీవిధంగావుంటే, యిక నా మాటేమి విని పించుకుంటాడు పోలింగుఆఫీసరు! ఇదిచూచి, ముందు మజిలీలో యెల్లావుంటుందో చూద్దామని బయలుదేరాను.

అయిదో స్టేషనుకు బయలుదేరాను. అక్కడ పేచీ యింకా గమ్మత్తుగా వున్నది. అదేమిటంటే, మంగలాడికి నామాలు పెట్టించి, వైష్ణవుడని వోటు వేయించాడనిన్నీ, చాకలి వానికి అక్షయపాత్రి చెంబు నెత్తిని బెట్టి సాతానుల మని చెప్పించి వోటు చేయించారనిన్నీ, ఒక పేడుమూతి వానికి కోక కట్టించి, ఆడదని చెప్పి వోటు చేయించారనిన్నీ పేచీలు పెట్టుకున్నారు. పై రెండింటి కేమికాని, (స్త్రీ) అని వోటు చేసిన వానిని, యెవనికైతే వ్యతిరేకముగా వోటుచేసినారో వారు, వోటరుగుడ్డ విప్పించమని పట్టు. విప్పువిప్పు మంటూ యుండగా, తీరా విప్పితే, యేమి చూడవలసి వస్తుందో అనే భయంతో యేదీకళ్ళ బడకుండానే బయటబడ్డాను.

అటు పిమ్మట ఆరో స్టేషను బయలు దేరాను. అక్కడ యేమి పేచీపడుతున్నారంటే, వోటరు ఒకడిపేరు చెపితే, పోలింగుఆఫీసరు గీత ఇంకొకడి గదిలో పెట్టాడనిన్నీ, బాలట్ పేపరు మీద యినిషియల్ వెయ్యకుండా, కాగితం మడిచి పెట్టెలోనికి తోసాడనిన్నీ తగాయిదా.

యేడో స్టేషనులో, తాలూకాబోర్డు వోటింగు పేపరు డిస్ట్రిక్టు బోర్డు పెట్టెలో వేయించారనిన్నీ, డిస్ట్రిక్టు బోర్డు

వోటింగు పేపరు తాలూకాబోర్డుల పేపర్లు వేయుటకు నిర్దిష్టమైన పెట్టెలో పడిన దనిన్ని, యిది బుద్ధి పూర్వకమని ఒకడున్నూ, ప్రమాదవశాత్తు అని రెండవ వాడున్నూ, తగాయిదా పడుతూ యుంటే, అర్ధగడియ భోగానికి ఆరు నెలల రోగమన్నట్లు, యీరోజున్నర హోదాలోను తన అసలు వుద్యోగమెక్కడ వూడుతుందో అని పోలింగు ఆఫీసరు ఖంగారు పడుతూ యున్నాడు.

యెనిమిదో స్టేషనులో బూతులు రెండు. నేను చెప్పిన వాడికి వోటు వేయక పోతే, యివతలికి వచ్చేటప్పటికి నీబుర్ర వుండెు చూచుకో అని బెదరించే జట్టు ఒకటి యెదురు గుండా కూర్చున్నది.

ఇంకొక బూతువద్ద, వోటర్లను ప్రింప్షు చేసేవారు ఒక జట్టుగా జేరి, తమపార్టీకి వోటు వెయ్యనివోటర్లను, వారి పేరు వుండె బూతుకుగాక, వారిపేరు వుండని బూతుకు త్రోవచూపడం, నీపేరే జాపితాలో లేదని చెప్పడంతోనే తనకు వోటు లేదేమోఅని ఖంగారుపడి, పప్పులో గరిటె లాగ్సు మెల్లగా జారటం: ఈవిధంగా వున్నది యిక్కడతంతు.

ఈభాగోతాలన్ని చూచాను. యెలక్షను ప్రచారము నను నాకుకొ్రత్త. ఇన్ని తంతుల నెదుర్కొనుటకు నాకు సిబ్బందిలేదు. సరుకూలేదు. అర్థబలమూలేదు. అంగబలమూ

లేదు. మొరబెట్టుకుంటే వినుపించుకునే నాధుడు కనుపించ లేదు. ఇదిన్నిగాక, నాఅభ్యర్థిత్వమనే నావకు తాడూ లేదు. చాపా లేదు. కొయ్యా లేదు. తొయ్యటానికి గెడా లేదు. తెడ్డూ చుక్కానీ అసలే లేవు తోసే కళాసులైనా, వారంతట వారొచ్చిన వారేకాని, నేను జీతభత్యములిచ్చి వుంచినవారూ కారు. కాన దైవమున్నాడను కున్నాను. పడవను గాలికి వదలి వేశాను. బయలుదేరిన చోటువుండ లేదు. అనుకున్న రేవుకూ చేర లేదు. మధ్యనొక రమణీయమగు ఉద్యానవనముతో ఆవృతమైన లంకలో లంగరు వేయబడివున్నది. లంకైతే నేత్రపర్వముగా ముదమును గూర్చుచున్నదిగాని, బయలు దేరిన నాబోటివారిస్థితి తలంచుకొంటె జాలివేస్తూయున్నది. గమ్యస్థానము చేరలేకపోవుటనుబట్టి నాకొఱకై నిరీక్షించు చున్న వారు నారాకకై యెట్టి ఆందోళన పడుచున్నారోగదా అనే పరితాపము వేధించుచూయున్నది. ఇది యిప్పటి నాస్థితి.

కవుంటింగురోజునాటి కంగారు.

వోట్లుపెట్టెలు తాలూకా ఆఫీసుచేరాయి. మేజస్ట్రేటు గారు కచేరిగదిలోనికి వాటినన్నిటినిచేర్చారు. 24-11-32 తేది ఉదయం విప్పుతారన్నారు. 23-11-32 తేదినిరాత్రి పెట్టెలు గయిరువిలియా చేయుటకు ప్రయత్నాలు జరుగుతూ వున్నాయనే పుకారుపుట్టించారు. దానితోటి కారులవారు,

జట్కాలవారూ, ఒంటెద్దుబళ్ళవారూ, రాత్రితెల్లవార్లు కచేరి చుట్టూపహారా యివ్వటం ఆరంభించారు. ఆవరణలో అర్ధరాత్రి వేళ యితరులెవరైనా అడుగుపెట్టితే గుండుదెబ్బకు గురిచేయ బడతారనే ఆర్డరుపుట్టినట్టు వదంతి బయలుదేరినది. కాండిడేట్లలో ముప్పాతికవంతుమంది కన్నాహారాలులేవు. బాగా వోట్లు పడ్డాయనుకున్న వారు చప్పున తెల్లవారితే బాగుండునురా అనుకున్నారు. తక్కువగా వోట్లుపడ్డవారు ఎల్లాగయినా యీపెట్టెలు పోవడంగాని, కీళ్ళూడిపోవడం గాని తటస్థించి రీయెలక్షనువస్తే గ్రామదేవతలకు నల్లమేకలను బలి యిస్తామని, బయటికి వెల్లడికాకుండా గుటకలు మింగుతూ, మూలమూల నక్కినక్కి మొక్కులు మొక్కుతూయుండేవారు. భళ్ళునతెల్లవారింది కాఫీహోటళ్ళవారికి రాత్రి చెప్పియుంచారు తెల్లవారేటప్పటికి అన్నీ తయారుగా వుండాలని. వదలీవదలటంగా పళ్ళుతోమి, తడిసీ తడవనట్టుగా మొఖంకడిగి దూరారు హోటలులో. ఇక్కడ అవశిష్టం తీర్చుకున్నారు. క్యాండిడేటులు, ఆమోదకులు, పరితాపపడి పనిచేశిన వారూ, ఆశ్రితులు, యింకా యితరబంధుమిత్రపరివారాదులంతా తాలూకాఆఫీసు గోడనానుకొని కొందరు, గోడ మీదకొందరు, చెట్లుకింద కొందరు, యెదురుగావుండే యిండ్ల అరుగుల మీద కొందరు, యెవరికి యేఆసనం వీలుగా వుంటే, ఆయాఆసనాలమీద బయఠాయించారు. ఇక ఆఫీసు

పెట్టెల్లో శీలు తెంపి, లోపల కాగితాలు బోర్లించడముతోనే, క్యాండిడేటున కొకయేజంటు, యేజంటునకొక అశిస్టెంటు. వీరిచుట్టూ జంటిల్‌మేన్లు, క్యాండిడేటు, యేజంటుమాత్రము మొగము వెలవెలబారే దొకడికి, వొళ్లుఝల్లుమనేదిం కొకడికి-వుండవలెను. ఇతరులను లోనికి రాకూడదనే నియమముమాత్రము వున్నదిగాని అది నామమాత్రమే. వోట్లులెక్క మొదలు పెట్టినతర్వాత, తక్కువ యెవరికిరావడం మొదలుపెట్టితే, వారివైపు నుంచి పేచీ లెక్కువవచ్చేవి. బాలటుపేపరులో X మార్కు వుండవలెనని వున్నదిగాని, ఆనియమమంతగా పాటింపబడలేదు. మార్కు అంటే యేదైనాసరే గీత అన్నారు. మార్కు పెట్ట డానికి బ్యాలెటుపేపరులో ఒకనిర్దిష్టప్రదేశము చూపించారు గాని, అదిఅంత నికరముగా పట్టింపుచేయలేదు. గీత ముద్దిదగ్గర వున్నాసరే. మూలదగ్గిర వున్నాసరే మయంగా వున్నాసరె నన్నారు. పెట్టెలన్నీ విప్పి కలబోసి లెక్కపెట్టారు కొన్ని; ఏపెట్టె కాపెట్టె లెక్కపెట్టారు కొంతవరకు. ఒకసర్కిలులో తాలూకాబోర్డులు, డిస్ట్రిక్టుబోర్డులు విప్పుతామన్నారు కొంత వరకు. తూతూ బొడ్డుకు తువ్వాలన్నారు. అటుతర్వాత, డిస్ట్రిక్టుబోర్డులన్ని ముందు విప్పాలన్నా రొక లీగల్ యడ్వయిజరుగారు. విప్పటంలోగాని, లెక్కపెట్టటంలోగాని వరుసావావి లేకపోయింది. తాలూకాబోర్డుల బ్యాలెటుపేపర్లలో, నాన్ రిజర్వ్‌డుసీటుకు యిద్దరు, రిజర్వ్‌డుసీటుకు యిద్దరూ

పోటీచేస్తూయున్నప్పుడు అందులో నలుగురిపేర్లూ వుండటం సహజం. ఒకవోటరు తనకుగల వోటింగుహక్కును రెండింటిని నాన్‌రిజర్వుడుసీటుకు పోటీచేసేవారి రెండుపేర్లను యెదురుగుండామార్కు చేసినాఆవోటు వారిదేఅన్నాడు. ఇవన్ని ఎందుకు ఆఖరుకు పోలింగుఆఫీసరు యినిషియల్ లేకపోయినావోటువానిదే అన్నారు. తుదకు ఒకటొకటి లెక్క తేలింది. కొందరు నిట్టూర్పులు విగుడ్చుకుంటూ కాళ్ళు తేలిపోతూయుంటే కళ్ళు భైరవులు గ్రమ్మి తడబడి పరధ్యాన్నంలోపడి త్రోవతప్పి ఎట్టకేలకు నలుగురిలోబడి, మెల్లమెల్లగా యిల్లుజేరేవారు.కొందరు గెల్చామనే ఉత్సాహము పొంగి పొరలి ఆనందబాష్పములు జలజలరాలుతూ యుంటె మనస్సులో అంతస్థుల మీద అంతస్థులు గల మేడలు నిర్మించుకుంటూ ఆనందాబ్ధిలో మునిగి తేల్తూయుండేవారు. పెళ్ళినాడు నన్ను ముస్తాబుచేసి పల్లకి యెక్కించి ముందు తాళమేళాలతో వెనుక పేరంటాళ్ల దండుతో ఒక ప్రక్కను బాజావాళ్ళు వింజామరలు విసురుతూ యింటింటికి పల్లకీ ఆపి పెళ్ళికొడుకు వేషముతో నన్నున్నూ పెళ్ళికూతురు వేషముతో నున్న నాకిచ్చిన పిల్లనున్నూ జూపిస్తూయుంటే నేను యిల్లాగా సంతోషించే వాడను. కాని పిల్లలు పుట్టి పురిటికి మంచము తెమ్మనే టప్పటికి తెలిసింది పెళ్ళినాటి నా సంతోషము యెక్కలోతు. కష్టం టింగునాటి కంగారిది.

ఫలితము వెల్లడైన తర్వాత పుట్టేవ్యూహాలు.

భారతయుద్ధము అయిపోయిన తర్వాత దుర్యోధనుడు భీమునివలన వోడింపబడియు ప్రాణములు విడనాడక విలవిల తన్నుకొని బాధపడుచుండగా శ్రీకృష్ణుడు వానికడ కేగి, బావా, నీవేల బాధపడుచున్నావని అడుగగా బావా అశ్వత్థామకు సేనాధిపత్యమిస్తే నేను గెలుద్దునేమోకదా అన్నాడట. నీవు అశ్వత్థామకు సైన్యాధిపత్యమిస్తే నేను నకులుని గుర్ర మెక్కిస్తా నన్నాడట. బావా, హస్తినాపురం చుట్టూ కంచు కోటకట్టిస్తే గెలుతునేమోఅన్నాడట. నేనుచక్రంఅడ్డంవేశిదానిని ఛేదింతు నన్నాడట. ఇంకేదో చెప్పితే, విదురుని చేతికి విల్లిద్దు నన్నాడట. ఈ విధముగా ఆరావేస్తె యింకావోట్లు పడును. ఇది చేస్తె వోట్లు పోకపోవును. అని మనస్సు పరిపరివిధముల పరితాపపడ సాగినది. తుదకు నేనుకూడా డబ్బుఖర్చు పెట్టాను కానుగదా అనేచింతకూడ కలిగినదిగాని, డబ్బి య్యటం మొదలు పెట్టితే అదివరకు ధర్మబద్ధులై పనిచేశినవారు కూడా తిరిగి పోతారేమో అనేభయం కలిగినది. ఇంతవరకు ధారాళంగా వెళ్ళిన నామనస్సు పరాజయం గలుగుట వినుట తోడనే, నీచవృత్తులకు వశ్యుడనైతే గెలువ గలిగి యుందు నేమో యనే చింతలోనికి కూడా లాగసాగినది. ఆఫీసులో గుమస్తా పనికి ఆక్టింగుగా జేరిన వాడు అసలు వాడు చచ్చిపోయి తిరిగిరాకుండా వుంటే తనకు ఖాయా

మవుతుందనే దుర్భ్రమకులోనగుట కలవడినట్లు, పరాజితుడైన తిరిగి వానికి పోవుటయెట్లు తటస్థించునా? ఇదివరకు లోట్లన్నిటి పూర్తిచేసికొని, తిరిగి నూతనతేజముతో విజృంభించి, తన ప్రత్యర్థిపైబడి కబళించవలె ననుకుంటాడుగాని, అట్టి దాక వేళ సంభవించినను, తిరిగి తాను ప్రయత్నము చేయుట తటస్థించినను, బాబుకు పెళ్ళి అవుతుందని సంతోషించి అమ్మకు సవతి సంప్రాప్తమగునని వూహించలేని వానివలె, తనకా సమయములో ప్రత్యర్థిగానున్న వాని శక్తిసామర్థ్యములు గుర్తింపలేక, నిర్లక్ష్యముతో పోగొట్టుకొనుటకూడ తటస్థించు చుండును. పరాజితుడైనవాడు ధీరవృత్తి నవలంబించి, గెలి చినవా డవలంబించిన నీచవృత్తులకు పై యెత్తులు వేసి గెలువ జూచుటకంటె అట్టి నీచవృత్తులకు లోబడకుండ వోటర్ల ఆంత రంగికములను నిర్మాలిన్యమొనరించి, నిజమగునట్టియు శాశ్వత మగునట్టియు భగవంతుడు మెచ్చునట్టియు జయమును పొంద జూచుట శ్రేయస్కరము. శాశ్వతానందదాయకము. ప్రభు హితమును ప్రజాసమ్మతముకూడా నగును.

జయాపజయాలలోని రకాలు.

ఇవి రెండు రకాలు. నైతికవిజయము, తాత్కాలిక విజయము. గంగగోవుపాలు గంటెడైనను చాలునన్నట్లు అంతః కరణశుద్ధిగా వాటమగు ప్రేమగలిగి వోటింగుయొక్క తత్వ మును గ్రహించి యివ్వబడిన వోట్లును పొందినవారికి కలిగి

నది నైతికవిజయము. డబ్బిచ్చి కొనుకొనుటచేత, ప్రజలను భ్రమపెట్టి మభ్యపరచి, భయాక్రాంతులను గావించి, దుర్బోధనలను చేసి, అభూతకల్పనలను కల్పించి, నిర్మలమగు ప్రజాసముదాయముయొక్క మానసికముల రెచ్చగొట్టి పెడత్రోవలకు మరల్చి పొందగలిగిన విజయము తాత్కాలికవిజయము. అట్టివారు తాత్కాలికముగా విజయము నంద గలిగినను, యథార్థపరిస్థితులు వెల్లడిఅయినతర్వాత నిజరూపము బయల్పడి, పరిహాసాస్పదుడు కాకమానడు. ఇట్టి పరిస్థితులలో విజయమునందినవాడు తానుచెందిన సంతోషముకంటె, సంగతిసందర్భములు వెల్లడైనతర్వాత తాను పడవలసియుండు పరితాపము వేయిమడుంగు లెక్కవగానుండు ననుట నిస్సంశయము. స్వచ్ఛమైన సాత్వికవృత్తిగల మానవుడు వెచ్చగానున్నట్టియు, పరిశుభ్రమైనట్టియు, సాత్వికాహారము మాత్రమే అపేక్షించి, పాసిపోయిన మాలిన్యసహితమగు ఆహారమును క్షుద్బాధాపీడితుడై యుండియు, ఎట్లు గర్హించునో అట్లే న్యాయమగు విజయముగోరు మెంబరు, ప్రజలయొక్క అంతరంగశుద్ధి యగు అనుమతిని పొంది వోటును వేయించుకొనుట శ్రేయస్కరముగాని, తదితరపద్ధతులద్వారా వోటింగు వేయించుకో జూచుట యెప్పటికైనను హానికరమే. ప్రెసిడెంటు కాజూచినవాడు మెజారిటీ కొఱకు, మెంబర్ల వోట్లు కొనుకొనని, ప్రెసిడెంటయిన పిమ్మట, తిరిగి వానిని విశ్వాస

రాహిత్యతీర్మానమెట్లు వేధించుచుండునో, అట్లే దౌర్జన్యపద్ధతుల నవలంబించి, విజయము పొందినవాడు, తాను చేసిన వాగ్దానములు చెల్లించ లేనప్పుడును, తాను వోట్లను కొను కొన్నవాడగుట వల్ల ప్రజలకూ వానికీ మధ్య నుండవలసిన న్యాయబద్ధమగు ప్రేమ యుండదు గనుకను, దౌర్జన్య మవలంబించుట చేత, తనచర్యలయందు ప్రజల కొక విధమగు కంప ముదయించి, దరిజేరుటకు శంకించుట వలన యెడబాటు గలుగుట సహజమగుటవల్లను తనస్వరూపమును వున్నది వున్నట్లు చెప్పక, మరుగుపరచిన వాడగుటవల్ల, తన్ను ప్రేమించిన ప్రజలకు, తాను తొలగియుండుట తటస్థించుట సహజమగుట వల్లను విశ్వాసరాహిత్యతీర్మానముచేత ఓడింపబడిన అధ్యక్షుని పరితాపముకంటె అనేకరెట్లు అదనముగా, నిరంతర సంతాపము నొందవలసిన వాడగుననుట తథ్యము. అధ్యక్షుని విశ్వాసరాహిత్యతీర్మానము వలన గలిగెడి పరితాపము త్రాచుపాముకాటువంటిది. ప్రజలయొక్క అంతరంగ శుద్ధియగు ప్రేమను చూరగొనలేక, మాయోపాయములచేత విజయముపొంది, నిజరూపము బయల్పడిన తర్వాత ప్రజలతో గలిగే యెడబాటువలన జనించే సంతాపము, కుళ్ళుపాడ కాటువంటిది. ఘ్రుండుమానదు. ప్రాణము పోదు.

కావున సహోదరులారా, యెప్పుడు యెవ్వరీ మెంబరు కొఱకు ప్రయత్నించినా, ప్రజల ప్రేమకు పాత్రుడై యెన్ను

కొనజూచుట శ్రేయస్కరముగాని, తదితరమార్గములన్నియు యాప్సితము నొనగూర్ప లేవనుట నిక్కమని నొక్కి వక్కాణింపగలను. నాపిల్లవానికి నేను డబ్బిచ్చి చిరుతిండి నేర్పిన తర్వాత తిరిగి వానికి డబ్బివ్వకపోతె, ఇతరుల జేబులు వెదకుటకు భయబడక దొంగతనమున కెట్లలవడునో, అట్లే వారి తరఫున ప్రతినిధులుగా నుండుటకు సిద్ధపడిన మీరు నీచవృత్తులకు వెరువకయుండు టనునది, వారిని దుర్బృవృత్తులకు ప్రోత్సహించి, దోహదమొసంగిన వారగుటలేదా! మిమ్ము లను వారు ప్రతినిధులుగా ఎన్నుకొనుటవల్ల మీపరిశుద్ధ ప్రవర్తనము వారి అజ్ఞానతిమిరమును వెడలనడచుటకు చేయూత నిచ్చునదిగా నుండవలెనుగాని, మరింత దోషభూయిష్ఠము గావింప గలుగునదిగా పరిణమించి ఉభయుల భావ్యాభివృద్ధికి ఆటంకకారి కాకతప్పదు.

## వోటర్లు అభ్యర్థులు:

### గమనింపవలసిన విషయములు.

i అభ్యర్థి గమనింపవలసిన విషయము లెవ్వియన: తా నా పదవి నిర్వహించుటకుగల సమర్థత తనయం దున్నదా? యనునది ముందుగా విమర్శించుకొని, నిశ్చయమునకు రావలెను.

ii తనవహాంగుదార్ల బలిమిని గుర్తెరింగి యుండవలెను.

iii తన ప్రత్యర్థులవ్యూహములను ఎప్పటి కప్పుడు కన్పెట్టి వాటికి ప్రతిక్రియలను పన్నుచు, అవసరమగునప్పుడు అవి యిగురెత్తి అలముకొనక మునుపే పురిటిలో త్రుంచివేయగల నేర్పరియై యుండవలెను.

iv అర్థబలము అంగబలమును కలిగి యుండవలెను.

v వోటర్లను డబ్బిచ్చి కొనుకొనజూచేవారి విధానముల కర్థ్వాతగల సామర్థ్య ముండవలెను.

vi కొందరు ప్రతిగ్రామమునకు ఇంతింత మొత్తమని, యేర్పర్చుకొని, అటుతర్వాత చూడనచ్చునని బజానా యిచ్చి ఆకట్టియుంతురు; వాటిని కన్పెట్టి దాని నెదుర్కొనుటకు ప్రతిక్రియలను పన్నుచు నుండవలెను.

vii కొందరు గ్రామములకు మొత్తములిచ్చి వోట్లుకొనుకొన ప్రయత్నిస్తే, ప్రత్యర్థులు పోలింగుఆఫీసరులను ప్రత్యర్థి యేజంటును కొని తమవైపునకు త్రిప్పుకొన ప్రయత్నిస్తారు. వాటిని సూక్ష్మదృష్టితో విచక్షించుచుండవలెను.

viii కొందరు తాము కోరుకొన్న పోలింగుఆఫీసర్లు తమ తమ పోలింగులో వేయించుకొన బ్రయత్నిస్తారు. ఇట్టి ప్రయత్నాలెందుకో, విమర్శించి తెలుసుకోవాలి.

ix లిస్టులో పేరున్న మనిషి లేనప్పుడు, మరొకమనిషిని తీసుకొనివచ్చి, ఆపేరుగల మనిషి యితడే యనిచెప్పి వోటువేస్తారు. అట్టిదానిని కన్పెట్టుటకు పోలింగుకు ముందుగానే, లిస్టుతీసుకొని, అందులో లేచిపోయిన వారిని, పారిపోయినవారిని, చచ్చిపోయినవారినిమార్కు చేసుకొని, వోటుచేసే ప్రతిమనిషిని యెరిగియుంట సర్వోత్తమము. ఆలా వీలుకానియెడ ఆప్రాంతము ప్రజలను స్వయముగా యెరిగివున్న తన హితమును కోరే యేజంటును తప్పక యేర్పఱుచుకొనుట అత్యంతావశ్యకము.

x కొందరు, తమకు వోట్లు పడ వనేచోట, గిల్లి ఖజ్జా పెట్టి కాలయాపన చేయుటయో, లేక, టెక్నికల్ అబ్జక్షన్సు పెట్టుచు పనిజరుగనీయక పోవుటయో చేయుచుందురు. అట్టిదెద్దియు ఆటంకపడకుండ పోలింగు ఆఫీసరుచేత, తనుడ్యూటీ, వోటరుకర్తవ్యము, క్యాండిడేటుబాధ్యత, యేజంటువిధి, పూర్తిగా గుర్తించునట్లు ముందుగానే నిర్దిష్టముగావించునట్లు చేయవలెను.

xi కొందరు, తమకుపడేవోట్లేగాని, యితరులకు పడకుండుటకుగాను, పోలింగుస్టేషనులో గుమ్మంవద్ద దడికట్టి తమతరఫు మనుష్యులనేగాని యితరులను లోనికిరానీయరు. పైగా ఇదేమి అన్యాయమని అడిగితే మీద

పడటానికి సిద్ధంగావుంటారు. దాని నెదుర్కొనుటకు తగిన ప్రయత్నము చేయుకవలెను.

xii కొందరు బూతులోనికిపోయి మార్కు వేయగలవారిని నిర్బంధించి మార్కు వేయలేననిగాని, కనపడదనిగాని, చెప్పించి, బహిరంగముగా చెప్పమనిదండించుటకలదు. అట్టిసందర్భములో చట్ట సంబంధమైన సౌకర్యమును, వృధపోనీయక కాపాడుట కవసరమగు చర్యదీసుకొనుటలో నిగా యుండవలెను.

xiii క్యాండిడేటులు, ప్రచారము చేయునపుడు తనకు వోటింగుచేయమని కోరుతూ, తన ప్రత్యర్థికిచాన్సు లేదంటూ లెక్కచెప్పి, వోటర్లమతి విరుచుటకు యత్నిస్తారు. అటువంటి కుయుక్తులను యెదుర్కొనుటకు సాధనాంతరముల నాలోచించి చూడవలెను.

ఈ విధముగా, నాప్రయత్నములో, దౌర్జన్యము, మోసము, లంచగొండితనము కపటము అహంభావము, ఈర్ష్య అసూయ, గడేకారితనము యిత్యాదు లెన్నియో తాండవమాడినవి.

వోటర్లుకూడా, బలవంతము, ముఖమాటము నిరాశా పీచత్వము, అయిష్టత, తిట్లాట, కొట్లాట, నిర్మొఖమాటము గా నిష్ఠురోక్తులాడుకొనుట, గ్రామస్థులలో పార్టీలు పడుట,

సమిష్టికుటుంబములో కలత లుదయించుట, అన్నదమ్ములకు పెడమొగము లగుట, ఆప్తబంధువులకు దూరులు కావలసి వచ్చుట, భార్యాభర్తలు పృథక్ శయ్యాగతులగుట, సేవకుల కుద్యోగములూడుట, యజమానులకు నమ్మకమైన పరివార ము దూరమగుట, దొంగతనము, మాయమాటలు, త్రాగుడు దుర్వ్యయము, ఇత్యాదులగు బాధలకు లోనుగావలసి వచ్చి నట్లు వినవచ్చినది.

కాబట్టి ఇక ముందు జరుగబొయ్యే యెలక్షనులలో మధ్యవర్తులు జోక్యములు కలిగించు కొనక, నిలుపబడిన వారలలో వ్యక్తిగతములగు పార్టీల పేర్లతో నిలువబడిన వారిని సరకుచేయక, వోటరును తన నిజరూపమును గుర్తింపజేసి, క్యాండిడేటు తన సామర్థ్యమును గుర్తెరింగి, ద్రవ్యమిచ్చి కొను కొనను విధానము వర్జించి సభ్యుల నెన్నుకొనుట సర్వవిధ ముల ఉత్తమోత్తమము. ఎన్నికల విధానములలో ఇట్టిపరి స్థితు లెప్పు డావిర్భవించునో ఆనాడే దేశసౌభాగ్య మొన గూడును. అట్టి సభ్యులుగల సభ, వారిచే చేయబడిన తీర్మా నములు ప్రజాక్షేమయుతములును, పక్షపాతరహితములును అయి యుండును. అట్లుగాక ప్రస్తుత విధానమే సాగనిచ్చిన యెడల దేశమోక్ష మొనగూడక పోవుటయే గాక, అందు నివ సించు ప్రజలలో అవినీతి పెచ్చుపెరిగి, నైతికబలము నానాటికి సన్నగిల్లి, చిరకాలార్జితమైనట్టియు, లోకవిఖ్యాతయుతమగు

నట్టియు, భారతీయుల యశ్శోతను యీకాలపువారు కొన సాగించలేక చీడపురుగులవలె నశింపఁజేసి అపఖ్యాతికి పాల్పడకపోరు.

—య. వెంకటరత్నం.

---

# వోటరు మహాశయులకొక విజ్ఞప్తి.

కొంత కాలమునుండి స్థానికసంస్థలకు సంబంధించిన యెన్నికలు రాజకీయపార్టీల ఆదర్శముల ననుసరించి జరుపబడక కులతత్వము, ద్రవ్యబలము నాధారముగా గొని జరుపబడుచున్నవి. ఇందువలన అసహాయులును అమాయకులును అగు ప్రజలలో రాజకీయ పరిజ్ఞానము వ్యాప్తినొందుటలేదు. అభిప్రాయభేదములు పరస్పరకలహములు మెండగుచున్నవి. ఇట్టితంతు రమారమి 10 సంవత్సరములనుండి అవ్యాఘాతముగా కొనసాగుచున్నది. దీనిని అద్భుతగల నుద్దేశించి, ముందంజ వేయ జూచువారలకు అనేక యాతిబాధలు అడ్డు తగులుచున్నవి.

ఇంతవరకు ఇట్టి గౌరవోద్యోగముల నధిష్ఠించి వారలలో, చాలమందికి, తాముచేసినదేమిటో, తమకెట్టి అనుభవజ్ఞాన మలవడినదో తమ్మెన్నుకొనిన ప్రజలలో తామెంతొ

విజ్ఞానమును పెంపొందింప జేయగలిగిరో, పార్టీలకు వశ్యులై విధిలేక చేతులెత్తవలసి యుండుటవలన ఎవరెవరి అంతరాత్మ యెంతెంత పరితాపపడినదో యెవరిమట్టుకు వారికి విదితమే.

ప్రజలుపడ్డ బాధలచేత నైతేనేమి, ప్రజలలో కలిగిన ప్రబోధముచేత నైతేనేమి, కాలము మారినది. మాటలతో పనిజరిగేకాలము గతించినది. ఇప్పుడు కావలసినది పనివాని తనమంటూ యున్నారు. ప్రతినిధి కావలసినవానికి వుండవలసిన లక్షణములు లోకజ్ఞానము, వ్యవహార దక్షత రాజకీయపరిజ్ఞానత త్వము స్థానికసంస్థల పరిపాలనా విధానమునందలి అనుభవ సిద్ధమగు పాండిత్యము అని సామాన్య మానవునివలన కూడ గుర్తింపబడినది. మావూరి మొత్తమునకు నాలుగువందల వోట్లు న్నాయి. ఏమి యిస్తారు అని అడిగేవారింకను ఉన్నారే కాని మనకుగల స్వాతంత్ర్యం అమ్ముకోకూడదురా అని మందలించే వారి సంఖ్యముందర వీరిసంఖ్య లెక్కింపదగినంతదిగా నుండుట లేదు. చేనుకాపునకు గడ్డిబొమ్మను చేసిపెట్టుకుంటే కాలము గడుచుటలేదా? ఆలాగున నే సమర్థతతో మనకేమిపని? మన కులపువాడైతే చాలునురా అనేవారు కూడా కొందరున్నారు. కాని మనకేసు యేదయినావుంటే దిట్టమయిన ప్లీడరు కిచ్చు కోవాలిగాని కులముతో మనకు పనేమిటిరా? కులపోడుగదా అని, కేసు వప్పగిస్తే విప్పిచెప్పలేక నోరెళ్లబెడితే, చెడిపొయ్యేది మనమేకదా? అందువలన కులముతో మనకేమిపని, మన కేసును

సమర్ధతతో నిర్వహించగల సమర్ధుడుకావాలిగాని అనేజ్ఞానులు రోజురోజునకు లెక్కకు మిక్కుట మగుచున్నారు.

ముందు జరుగ బోయ్యే యెన్నికలలో యెన్నికదారుల అభిప్రాయములు, వివిధరకములుగ, ముందు సూచన లగుపించు చున్నవి. ఇది వరకు ఒకసంఘము వారికి ఇంకొక సంఘము వారితో సంఘర్షణ లుదయించేవి. ఇప్పుడు యీవ్యాధి సంఘములో సంఘమువారికే వ్యాపించేటట్టు కనుపించుచున్నది. నిజముగా ఇట్టి సందర్భములే వచ్చేయెడల, సామాన్యప్రజల యిబ్బందులు వర్ణింప నలవిగానివిగా నుండుననుట నిస్సందేహము.

ఇట్టి సందర్భములను జూచి, యేప్రజలమధ్య నుండి వారిసహాయసంపత్తివలన నేను నాజీవితమును సుఖముగ వెళ్లబుచ్చవలెనని అపేక్షించితినో వారికి నా శక్తికొలది సేవ చేయదలచి ఈ ఫిర్కాలోని జిల్లాబోర్డు మెంబరు పదవికి ఆశింపవలసి వచ్చినది. ఇట్టి పదవి నావంటి వా డపేక్షించినాడనుట తోడనే చాలమందికి ఆశ్చర్యముగా నుండవచ్చును. ఈకాలమందు స్థానికసంస్థలలో బ్రాహ్మణునకు తావుండదని నాకు భయము లేకపోలేదు. కాని నాప్రజలు నన్నొక అపాయకరమగు వానినిగా కృతఘ్నునిగా భావించరనే నమ్మకము నాకు గలదు. నాకుగల ప్రపంచజ్ఞానమును రాజకీయపరిజ్ఞానమును సహాయముగా గొని సోదరసమానులగు ప్రజలను

సేవజేయదలచి నేనిందుకు సాహసించితిని. ఒకసారి యెన్నికకు నిలువబడి, నేను దేశాటనజేసిసంపాదించిన లోకానుభవమును, కష్టించి గ్రంథావలోకనముజేసి సముపార్జించిన రాజకీయపరిజ్ఞానమును, స్వయముగా అనేకబాధలకు లోనై జీర్ణింప జేసికొనియున్న లౌకికవ్యవహార దక్షతను, స్థానికపరిపాలనాయంత్రముయొక్క వివిధాంతర్భాగముల గమనికలోని నాస్వానుభవమువల్ల సేకరించి యుంచినపనివానితనపు కిటుకులున్నూ, ఈ ప్రతినిధితత్వముద్వారా మీకై వినియోగించి అందలి మంచిచెడ్డలను తమకు చవిజూపి మిమ్మానందింప జేతునని త్రికరణశుద్ధిగా విన్నవించుకొనుచున్నాను. నేనేపార్టీకి చెందినవాడనుకాను. నాకు చిన్నతనమునుండియు ప్రజాసేవ యనిన ప్రీతిమెండు. ప్రభుత్వమునకు ప్రజలకు ఒకరియెడ ఒకరికుండవలసిన అన్యోన్యాదరణలలో ఒకరినొకరు హద్దుమీరి ప్రవర్తింపకుండ అనుసరింప జూచుటయే నాచిత్తవృత్తి. మొగమోటమునకు, కపటనటనకు, పక్షపాతమునకు నాహృదయములో తావులేదు. పరపీడనయనిన నాకు పరమ అసహ్యము. నామనస్సు నీచవృత్తులపై కెన్నడును ప్రసరింపదు. పత్రికలలో నేను వ్రాయువ్యాసముల బట్టియు, నావలన వ్రాయబడి ప్రచురింపబడినగ్రంథములనుబట్టియు, నాతత్వము తమకు బోధపడగలదు.

లోకల్ బోర్డుల ద్వారా ప్రజలకు కలిగే శిక్షణమును, ప్రతినిధులు చేయగల పనియును, ఇదివర కీపదవుల నధిష్ఠిం

చినవారు చేసినపనియు, జిల్లాబోర్డునకు సంబంధించిన ఆదాయ వ్యయములునూ, దానిని సాలీనా పంచిపెట్టు విధానమును పంచిపెట్టినదానిని వ్యయపరుచుటలో వినియోగించవలసిన బుద్ధికుశలతయున్నూ ఎప్పటి కప్పుడు మీకు విశదపర్చుచు చెప్పినంతచేసి, చేసినదిమాత్రమే తు-చ తప్పకుండ మీకు నివేదించెదనని నమ్మబలుకుచున్నాను.

కాలమహిమ యేమోగాని యీ పర్యాయము నామినేషనులకు పూర్వమే యెన్నికల ప్రచారము ప్రారంభమైనది. ముందుగా తెలుపలేదనే నెపమునకు పాల్పడకుండుటకై యీ విజ్ఞాపన మూలముగా తమకు విన్నవించుకొనుచున్నాను. కావున విషయములను పూర్తిగా విమర్శించి నే నర్హుడనని తోచినయెడల మీ వోటు నా కిచ్చి నన్నెన్నుకొని, నా విజ్ఞాపనము మీ అభ్యుదయమునకై వినియోగించుకొన ప్రార్థించుచున్నాను.

యద్దనపూడి వెంకటరత్నం.

---

# వోటర్లకు తొలిపలుకు.

## వోటు హక్కంటే యేమిటి?

1. వోటు హక్కు అంటే మీసాలకు రంగు వంటిది. మోతాదుగా యెక్కడ యెంతపట్టించాలో అంతా అక్కడ

పూస్తే తెల్లని వొంటుికలు నల్లబడి మొఖానికి అందంవస్తుంది. మోతాదు తెలుసుకోకుండా, యెవరియిష్టమువచ్చినట్టు వాడు, యెవరెల్లాచెపితే అల్లాగరాస్తే చర్మానికి అంటుకొని, మూతి పుండై, పుండు మానేటప్పటికి, బొల్లి మచ్చలు తేల్తాయి. కాబట్టి జాగ్రత్త.

2. వోటుహక్కు అంటే పాషాణ ప్రయోగం వంటిది. రోగాన్నిగుర్తించి, సమయానుకూలంగా ప్రయోగిస్తే టకీలున రోగం మళ్ళుతుంది. నీతి నియమం లేకుండా ప్రయోగిస్తే ప్రాణం తీస్తుంది. కాబట్టి జాగ్రత్త.

3. వోటు హక్కంటే, శాల్వరస్‌ను ఇంజక్షనువంటిది. ద్రావకం సరిగా రక్తనాళంలోనికి ప్రవేశింపచేయగలిగితే అది చేసేపని అద్భుతం. సూది యేమాత్రము బెసికినా, ద్రవం నాళంలోనికి పోక, ప్రక్కకు పోయిందంటే వెయ్యితేళ్ళు కుట్టినంతమంట యెత్తుతుంది. తరువాత యేమనుకున్నా లాభం లేదు. ఒక్కొక్కప్పుడు అంతమేరా యెండిపోతుందికూడాను. కాబట్టి జాగ్రత.

4. వోటు హక్కంటే సానబట్టిన కత్తివంటిది. దానితో సాము చేయుట త్రాచుపాముతో చెలగాటవంటిది. క్రమముగా దానిని త్రిప్పగలుగుటయే పనివానితనము. నిర్లక్ష్యముగా వాడితే దానిమూలముననే కూడిరాని నష్టము సంభవించును. కాబట్టి జాగ్రత.

౫. ఓటు హక్కంటే, పురష కారత్వమునకు నిదర్శనము. దానిలో భాగమివ్వమని అన్నదమ్ములైనను అడుగలేరు. దానిని సద్వినియోగము చేయగలవానికి అది సౌఖ్యము నిస్తుంది. సద్వినియోగము చేయుటలో స్వశక్తి నుపయోగించలేని వానికది, పులుసుకుండలోని తెడ్డువలె, పులుసులోని రుచిని గ్రహించలేక, శీతవాతములను సహించుచుండునట్లై, నిరుపయోగమై భారవహమగును. కాబట్టి జాగ్రత.

## పార్టీ అంటే యేమిటి?

ఒక పార్టీకి అంటియుండడమంటే డబ్బిచ్చి తద్దినం కొనుక్కోవటం వంటిది. నాయకులలో పార్టీ వుండడము సహజమే. కాని గ్రామస్థులకు వోటర్లలో పార్టీలుండటం అనర్థం. పార్టీల ననుసరించి పాటుపడేవారు పడేపరితాపమునకు, ఇద్దరు పెళ్ళాల మొగుడుపడే పరితాపమునకు మేరమీరిన వ్యత్యాస ముండదు. పార్టీలకువశ్యులై ఓటువెయ్యడమంటే స్వాతంత్ర్యం అమ్ముకోవడం, అధికారం బుద్ధిపూర్వకముగా దుర్వినియోగం చేయడం కాబట్టి నాయకుల పార్టీల ననుసరించి మీలో మీకు పార్టీలు పడడం చాల ప్రమాదం. కాబట్టి జాగ్రత్త.

## బ్రోకర్ల బోధనలు.

సంసారిని లేవదీసుకొని పోదలచిన సరసుని మాటల వలె తాత్కాలికముగా రుచిగా నుంటాయి. భావోద్రేకం

కలుగజేస్తాయి. ఎండమావులలో నీరున్నట్లు భ్రమింపచేస్తాయి, అరటిపండొలచి చేతిలో పెట్టినట్లు చెపుతారు, సిద్ధాన్నం తోసుకోవద్దంటారు. ఇట్టివన్నియు తాము పన్నిన వలలోని కీడ్పుటకొఱకే. ఇట్టివన్నియు నిజమని నమ్మి మోసపోక, మీా విచక్షణ నుపయోగించండి.

కాబోయ్యే ప్రెసిడెంటు పదవికి వోటిస్తానని, తన తరఫు బలపరచమని పార్టీనాయకులను కోరడము, తన అసమర్థత వెల్లడించుకోవడమే. నిన్ను నేను బలపరుస్తాను నీవోటు నాకిస్తావా అని నాయకుడు కోరడముకూడ, పెండ్లికి ముందర మనువర్తి మొత్తా బేరమాడుటవంటిదే? వీరిద్దరు లాలోచీ అయి, ముందు యేమిచెప్పు తేనెయున్నారో అని వోటర్లు ఆరాతీయుటకు సావకాశమిచ్చును. ఇట్టి విషయములన్నియు ఆమూలాగ్రముగా విచారించవలసిన బాధ్యత వోటర్లయందున్నది. కాబట్టి జాగ్రత.

ఇట్లు విన్నవించు,
వోటరుల శ్రేయోభిలాషి.

---

# వోటరు, క్యాండిడేటు సంవాదము.

యద్దనపూడి వెంకటరత్నం.

క్యాండిడేటు—అయ్యా! రాబోవు లోకల్‌బోర్డు యెన్నికలలో, జిల్లాబోర్డు సీటునకు నేనొక అభ్యర్థిగా నుండ

బోవుచున్నాను. గాన, నేనర్హుడనని తోచినయెడల మీవోటు నాకిప్పించుమని నా ప్రార్థన.

వోటరు—మీదేపార్టీ అండీ ?

శ్యాం—నాకు పార్టీ అంటూ లేదు. నాది ప్రజల పార్టీ.

వో—ఏ పార్టీని అంటిపెట్టుకుని యుండకపోతే, మిమ్ములలేవనెత్తేవారెవరు ?

శ్యాం—ఈశ్వరదత్తమగు నా ప్రజ్ఞావిశేషములు. వోటర్ల విచక్షణాశక్తి.

వో—ఏ పార్టీని అంటియుండకపోతే, మీవాదమును సమర్థించేవారెవరు ?

శ్యాం—న్యాయబుద్ధికలవారు .

వో—ఒక పార్టీని అంటియుండటంవల్ల వచ్చే బాధలేమిటి ?

శ్యాం—పార్టీలంటూ వుండడంతోనే, వారికి కొన్నినియమము లుంటాయి. పార్టీ నియమములకు బద్ధుడై యెన్నుకొనబడినవాడు, పార్టీ నిబంధనల నతిక్రమించకూడదు. అందువలన పార్టీనంటియుండడంవిజయమునకుసహాకారి యైనప్పటికి యెన్నుకొనిన ప్రజాసమూహామునకు ఒకొక్కప్పుడు అపకారిగా పరిణమించవచ్చును.

వో—రాజకీయములో పార్టీలుంటాయి కదా ! పార్టీ అంటే పక్షపాతసమన్వితమై యుంటుందంటారా ?

శ్యాం—పార్టీ నాయకులు స్వార్థము లేకుండ విషయవిమర్శన చేస్తూ, దేశహితముకొఱకు, ప్రజాహితముకొఱకు, ధర్మశాస్త్ర నిబంధనల నతిక్రమించకుండా, వాదోపవాదములు చేస్తూయుంటే, సరసముగా కార్యసరళి నడుస్తుంది గాని, వ్యక్తిగత ద్వేషములు మనస్సునందుంచుకొని, ఒక పార్టీవారు అవునన్నది రెండవపార్టీవారు కాదనడమే కర్తవ్యముగా పెట్టుకొని వాదోపవాదలోనికి దిగడం, అన్నివిధములా అనర్థమే. ఇట్టి సందర్భము తటస్థించినప్పుడు ఒక పార్టీకి చెందిన ఒకవ్యక్తి తన పార్టీనాయకుడు త్రొక్కుచున్నది పెడమార్గమని తెలిసినప్పటికి దానిని వెల్లడించి పూర్వపక్షముచేయుటకు వలనుండదు. వూరుకొనలేక సాహసించి వెల్లడించినయెడల వెంటనే అత డాపక్షమునుండి బహిష్కరింపబడతాడు.

వో—మీరే పార్టీకి చేరక స్వతంత్రపక్షమునం దుండుటయెందుకు ?

శ్యాం—ఒకపార్టీవారు యేదైన తప్పుత్రోవ త్రొక్కుచున్నపుడు అట్టిది న్యాయముకాదని వారికి నచ్చజెప్పి, సక్రమమైన మార్గమునకు త్రిప్ప ప్రయత్నించుటకు అవసరమగు స్వేచ్ఛాస్వాతంత్ర్యములుండుట కొఱకు,

వో—పదిమంది వాళ్ల తరఫున చెయ్యెత్తుతూ యుంటే మీ మాటల లక్ష్యపెట్టేవా రెవరు ?

శ్యాం—నాతత్వం మీకు నచ్చితే వాళ్ళకుకూడా నావాదము నచ్చి నాపక్షమునకు తిరుగుతారని, మీ రెందుకనుకో గూడదు. గొడ్డుగేదెలను అరకగట్టి దున్ని మీ ప్రజ్ఞా విశేషములచే పాడిబఱ్ఱెలగా జేయుటలేదా ? కంక బీళ్ళను దున్ని సుక్షేత్రములుగా మార్పగలుగుచున్న దిన్ని, పోడుగొట్టిన భూములలోని, చెట్టు మొదలు యొక్క వేళ్ల చిక్కములో నాగలి తగులుకోకుండా తప్పించి దున్ని కొంతకాలమునకు వాటి ఆటంకము లేకుండ జేసికొనగలుగుచున్నది మీ తెలివితేటలవల ననేకదా ? ఇట్టి విషయము లనేకములు మీకు అను భవసిద్ధమైయుండిన్ని వ్యతిరేక పార్టీలోనివారిని కూడ, ధర్మబద్ధమగు పార్టీకి త్రిప్పగలుగుట అసాధ్యమని భావించుట మీయమాయకత్వమా? నాదురదృష్టమా?

వో—మీ వైపునకు తిప్పుకొనగలిగినను వారి బుద్ధి మారుతుం దనే నమ్మకము మీకున్నదా ?

శ్యాం—వెర్రిసోదరుడా ! చిటికెడు పటికిపొడుము కుండెడు నీటిలోని బురదను విరుచుట లేదా ? ఒక్కయిండుపు గింజ మొన్ని కుండలలోని బురదనీటిని, బురదను విరచి

మంచినీటిని తేల్చుచున్నదో మీ రెరుంగనిదికాదు. ఈశ్వరదత్తమైన నిదర్శనము లనేకము:లుండ, మీ కేం దుల కీ అపనమ్మకము.

వో—మీ రిప్పటివరకు యేమిచేస్తూయున్నారు ? ఇదివర కెందుకు బయటపడలేదు ?

శ్యాం—సాధారణముగా యీ పదవియొక్క కాలపరిమితి చట్టములోని సూత్రములనుబట్టి చూచినచో మూడు సంవత్సరములు. ఈపర్యాయము దీనిగడవు, గవర్న మెంటువారి కార్యావసరము బట్టి యైతేనేమి, మెంబర్ల రాహువు వక్రించడం చేత నైతేనేమి, రమారమీ 5 సంవత్సరములవరకు పొడుగింపబడినది. దీనియందు వ్యామోహము గలవారు, రమారమీ రెండు సంవత్స రములనుండి ప్రయత్నిస్తూ యుండడం, గవర్నమెంటు వారు గడవు పొడుగిస్తూ యుండటంవల్ల నిరుత్సాహ పడి, విరమిస్తూ యుండటం, కనిపెట్టి, తేదీలు నిర్ధారణ అయ్యేవరకు నేను బయటికి రాదలచుకోలేదు. తేదీలు నిర్ధారణ అయ్యాయి వెంటనే నా అభిప్రాయమును వెల్లడించినాను. ఇది ఆలస్యమునకు కారణము.

వో—మీ స్వార్థబుద్ధితోగాక, పరహితముకొరకు కీపదవి నభిల మించుచున్నామంటిరే? ధర్మసంస్థాపనకొరకు పాటు

పడవలెనంటే, ఈ మార్గమేగాని మరొక మార్గము లేదా ?

శ్యాం—సర్వశక్తుడైన శ్రీ మహావిష్ణువు సహితము దుష్ట శిక్షణ, శిష్టపరిపాలనా, తాను స్వయముగా చేయ సమర్థుడై యుండియు, అవతారము లెత్తక తప్పినది కాదు. న్యాయమును సమర్థించుటకు, సమర్థత యున్న ప్పటికి, నిమిత్తము కొఱకేదో అవతారమెత్తక తప్పదు. అందువలన ప్రస్తుతము నేనీ అవతారము నెత్త సంకల్పించితిని.

హో—నీవు బ్రాహ్మణుడవుకదా? నీకు హోటెవరిస్తారు ?

శ్యాం—అమాయక సోదరుడా ? గవర్నమెంటువారు యేయే డిపార్టుమెంటులో యెన్నెన్ని మార్పులు చేసినారు గాని, ప్రభుత్వపు లెఖకు ప్రాతిపదికమైన కరిణీకము లును, న్యాయవిచక్షణకు ప్రాతిపదికములైన, న్యాయాధి పతిత్వములును, బ్రాహ్మణాధీనమునుండి తప్పించలేదు. ఏరోజునైతే ప్రభుత్వమువారీ రెండు సంస్థలనుండి బ్రాహ్మణులను పూర్తిగా తొలగించెదరో ఆరోజున బ్రాహ్మణేతరోద్యమమునకు ప్రభుత్వసహాయ సాను భూతులు పూర్తిగా కలవని నమ్మండి. లేనివాడు ఈ యుద్యమము ప్రత్యేక మొక రాజకీయ సౌకర్యము

కొఱకు కల్పింపబడినదనుకొండి. అంతేకాని, ఈ యుద్యమము శంకర, రామానుజ, మధ్వాచార్యాది, మత సంస్కర్తల సంస్కరణములవలె, హిందూజాతి నుద్ధరించి వారి కీర్తిని చిరస్థాయిగా జేయుటకై పన్నబడినదికాదు. కాబట్టి నిర్హేతుక జాయమాన కరుణా కటాక్షమని నమ్మి మోసపోకండి.

వో—ఇదివరకే ఒక పార్టీవారికి మాట యిచ్చినామే? ఇప్పుడు తప్పితే బాగుంటుందా ?

శ్యాం—ఇంకా నామినేషనులు దాఖలు కాలేను. నామినేషనులు కాబొయ్యేసరికి యెవరుంటారో, యెవరూడుతారో తెలియదు. ఇప్పుడు మీవద్దకు వచ్చి చెప్పినవారివి, వుద్దేశాలు. అట్టి వుద్దేశాలు గలవారికి, మీరిచ్చేది ఆమోదం. అంతేకాని వాగ్దాన మనుపించుకొనదు. వుండేది, వుండనిది, సందేహాస్పదమైనప్పుడున్నా, నీవు వుండటమనేది స్థిరమైనప్పుడు నేను సహాయము చేస్తాననేదిన్ని అభయముగాని, వాగ్దానముగాని, కాజాలదు. ఇదిన్నీగాక, మీ పలుకుబడి విని యోగించడంవల్ల నాకు లభ్యమయ్యే పదవి, నన్ను సమూలముగా నిర్మూలముచేసే దయ్యేయెడల మీ పలుకుబడికి యెట్టి కీర్తివస్తుందో మీ రెరుంగనిదికాదు.

లేక మీ పోత్సాహములవల్ల నాకు వోటుయిచ్చిన ప్రజలకు నేను చేయువలసినపని చేయుటకు అసమర్థుడనైన యెడల వారి వలన మీకెట్టి ఘోషవస్తుందో మీకెరుగం గనిదిగాదు. ఇట్టి సాధక బాధకము లన్నిటిని పూర్తిగా యోచించిన పిమ్మట యివ్వబడినదే న్యాయసమ్మతమగు వాగ్దానమగునుగాని, తదితరములు, హానిస్వ దృష్టిసమన్వితము లనుపించుకొనక మానవు. పలుకుబడిని పక్షపాతబుద్ధితో మేళవించడమే దౌర్జన్యము. దౌర్జన్యమువలన తాత్కాలికముగా, విజయము చేకూరినను, నైతికవిజయము సాత్వికముదే యైయుండుట సహజము. కావున మీరు విషయమును పూర్తిగా విచారించి, న్యాయపద్ధతికి చేయూత నిచ్చుట సమంజసమని నా అభిప్రాయము. అటుపిమ్మట మీచిత్తము.

వో—సరే? యింకా వ్యవధివున్నదికదాఅండి ? ఈలోపుగా నిదానముగా, యోచించి, మరీ మావోటుహక్కును వినియోగిస్తానని, మీకు అభయమిస్తాను.

క్యాం—అదేనేను మిమ్ములను కోరేదిన్నీ.

వో—సెలవు దయచేయిస్తారా ?

క్యాం—చిత్తం, మంచిది.

---

పశ్చిమ గోదావరిజిల్లా తాడేపల్లిగూడెం రవిన్యూ ఫిర్కా
కమ్మ సోదరులకు వినయ పూర్వక మగు

# విన్నపము.

యద్దనపూడి వెంకటరత్నంగారిని నేను సుమారు 20 సంవత్సరములనుంచి యెరుగుదును. పదిసంవత్సరములు నావద్ద పనిచేసినారు. కమ్మరికములో నా బంధుత్వమునకు సంబంధించి నంతవఱకు, ఆయన నెరుగనివారు గాని ఆయన ఎరుగనివారు గాని, వుండరు. విశ్వాస పాత్రులు. ఆయన బుద్ధి కుశలతకు మెచ్చుకొననివారు లేరు వీరు నా వ్యవహారము చూచే కాలములో, నేను రాజమండ్రి తాలూకాబోర్డు మెంబరుగాను, గోదావరి జిల్లాబోర్డు మెంబరుగాను, దేవస్థానము కమిటీ మెంబరుగాను, అగ్రికల్చరల్ సొసైటి మెంబరుగాను వుండేవాడను. ఇవిగాక యింకను యెన్నియో గౌరవోద్యోగము లుండేవి. నేటివఱకు యిట్టి గౌరవోద్యోగములలో నేను పోటీలేకనే యెన్నుకొనబడుచుంటిని. నామినేటెడ్ పదవులలో కూడ గవర్నమెంటువారు ఒక పర్యాయము కాలపరిమితిముగిసినను, నన్నే తిరిగి నియోజించెడివారు. ఇట్టి పదవుల ధర్మములన్నియు నావలన సక్రమముగా నిర్వహింపబడుటకు చాలమట్టుకు వెంకటరత్నంగారి సహాయసానుభూతులే కారణమని నొక్కి చెప్పగలను.

ఇప్పు డీయన పశ్చిమ గోదావరి జిల్లాలోని తాడేపల్లి గూడెంలో వ్యాపారం చేసుకొనుచున్నారు. ఆఫిర్కాలోని జిల్లా బోర్డు సీటునకు, రాబోవు యెన్నికలలో అభ్యర్థిగా నుండ యత్నించుచున్నట్లు ఆంధ్రపత్రిక మూలముగా వినవచ్చు చున్నది.

ఈయనకు విస్తారము లోకానుభవము కలదు. అందులో స్థానికసంస్థల పరిపాలనా విధానము పుట్టు విద్య. దాని వుత్పత్తి స్థితి, లయములు పూర్తిగా తెలుసునని నేను ఘంటాపథముగా చెప్పగలను. పట్టుదల, కార్యదీక్ష నిరుపమానము. నిష్కపటి. కుటిలవృత్తిలేదు. న్యాయమునకై పోరాడుటలో ఆయన కాయనే సాటి. ధారాళమైన మనస్సు. పరోపకార చింత లెస్స. పట్టాలు పొందదగిన పరీక్ష లెవ్వియు ప్యాసు కాలేదుగాని, గొప్ప గొప్ప పరీక్షలు ప్యాసైనవారుకూడ ఆయన సలహా కొఱకు మా గ్రామము తరుచు వచ్చుచుండెడివారు.

ఈయన యీపదవి కెంతయు అర్హుడు. ఈయన నీ పదవికి యెన్నుకొనుటయనిన, ఫిర్కావోటర్లు తమ్ము తాము గౌరవించుకొనుటయే గాక ఆ పదవికి అలంకారము తెచ్చిన వారగుదురు.

కావున, ఫిర్కాలోని కమ్మసోదర్లు, యితర బ్రాహ్మణులవలె, శ్రీ వెంకట రత్నంగారిని త్రోసిరాజనక, మీ మీ

వోట్లను వారి కిచ్చి మీ ప్రెసిడెంటుగా నా నెన్నుకొని మీకు గల వోటింగు హక్కును సద్వినియోగము చేయ ప్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుడు,

మిర్తిపాడు,
15_9_1932.

(Sd.) మద్దిపోటి వెంకటాప్రమన్న,
తాలూకా, జిల్లా బోర్డుల మెంబరు వగైరా,
తూర్పు గోదావరి జిల్లా.

---

ఓం.

# బోర్డు అంటే యేమిటి?

ప్రజలవలన వసూలు చేయబడినట్టిన్ని, ప్రభుత్వమువారివలన యివ్వబడినట్టిన్ని, సొమ్ము మొత్తమును ప్రజల సౌఖ్యమునకై వినియోగించుటకు, యేర్పడు ప్రతినిధులు గల సభ.

దీనిలో మెంబరుగా నుండకోరువారెట్టివారై యుండవలెను?

దీనివలన తమకు క్రొత్తగా రానున్న గౌరవమువలన పొందవలెనని ఆశించు ఆనందము కంటె, అగౌరవమే యెక్కువగా కలుగుతుందేమో అనే భయముతో, కాపుదారి చేసుకుంటూ, పాపభీతి గలిగి, జవాబుదారీ వహించి, వ్యవహారించడానికి పూనుకునేవాళ్ళే యీపనికి తయారు కావాలి.

ఇదివఱకు తయారైన వారిలో చాలామంది యెట్లాంటి వారున్నారంటే ?

బోర్డు, మెంబరు, వోటు, ఎలక్షను, మీటింగు, రావటం, పోవటం, బత్తెం బిల్లు, అను మాటలు తప్ప, తతిమ్మా విషయములు యేమి జరుగుతూయున్నాయో తెలియని వారున్నారంటే ? లేరని ? గుండెమీాద చెయ్యి వేసుకొని, నిర్భయముగా చెప్పగల వారెవరైనా వున్నారా ?

ఈ శాస్త్రములో రమారమీా 250 శెక్షనులు, 80 కి పైగా దరిమిలా చేర్చబడిన నిబంధనలూ వున్నాయి. బోర్డు వ్యవహారము సక్రమముగా నిర్వహింపవలెననిన, యింకా అనేక యితర శాస్త్రములతో పరిచయముండాలి. చట్టము యొక్క మూలము తెలియాలి. చెప్పేకుగల నీటివాళ్లను గుర్తెరింగినట్లు, ఆదాయమునకు సంబంధించిన వనర్లు తెలియాలి. పరిపాలనకు సంబంధించిన యికమతులు బోధపర్చుకోవాలి. మెంబర్లకు వుండే హక్కులను తేటతెల్లముగా తెలుసుకోవాలి. మీటింగు మర్యాదలు నేర్చుకోవాలి. ప్రశ్నోత్తరములలో ఉత్తమమధ్యాలు కనిపెట్టాలి. తన్నెన్నుకొనిన ప్రజలకుజవాబు చెప్పవలసివుంటుందనే యింగితముండాలి.

బోర్డులోని మెంబరీకి ప్రయత్నించువారిలో, చాలమంది, స్వలాభము కొఱకు అపేక్షించేవారు కాకపోయినను,

అదియొక అలంకారమని భావించువారు చాలమంది యుందురు. ఇట్టివారిలో, తాము అచ్చట చేయవలసిన పని యేమిటో తెలియనివారై యుండుటకూడ సహజమే. ఎన్నుకొనబడిన పిమ్మటకూడ, తాము చేయవలసిన పనిని నేర్చుకొనుటకు ప్రయత్నించరు. సరికదా! తెలిసికొనుటకైనా ప్రయత్నించరు. ఇదిచాల ప్రమాదకరమగు విషయమనివ్రాసు రాజధాని లోకల్ బోర్డుల చట్టమునకు వ్యాఖ్యానము వ్రాసిన, చెంగల్పట్టుజిల్లా, తిరువళ్ళూరు కాపురస్తులును, సుప్రసిద్ధ న్యాయవాదులును అగు మహారాజశ్రీ, సి. వి. నాయుడుగారు, తమచే రచియింపబడిన గ్రంథముయొక్క పీఠికయందు వ్రాసియున్నారు.

మెంబరు నెన్నుకొనవలసి వచ్చినప్పుడు విచారించవలసిన హంశములు.

బజారునకు పోయి మనకు కావలసిన సామానులను కొనుక్కొన బోవునప్పుడు, మంచివాటి నెన్నుకొనుచున్నాము. వ్యవసాయపు పనిముట్లను కొనుక్కొనబోవునప్పుడు, పొరలేకుండా చూచి పదును, వాటముచూచుచున్నాము. కుమ్మరావమునకు పోయి, మనకు కావలసిన కుండలను, గూనలను కొనబోవునప్పుడు, వాయించి చూచుకొంటూయున్నాము. బట్టలనుకొనబోవునప్పుడు, ఒకదానినిచేతబుచ్చుకొని, దాని నాణ్యము, పొడుగు, వెడల్పు, మన్నికలను

గురించి విచారించుచున్నాము. అంతే కాని యేది యిస్తే అది మనము పుచ్చుకొనుట లేదు.

కాబట్టి, మీవోటు, నాకిమ్మని అడగడంతోనే. మీరు విచారించవలసిన విషయములేవంటే, మిమ్ములను వోటిమ్మనమని అడిగినవాడు, స్వతంత్రుడా? అస్వతంత్రుడా? భక్ష్యాముక్షాలు తీరినవాడా ? లేక ముక్కు పచ్చలారనివాడా? ఒకరి ప్రోద్బలముచేత బయలుదేరినాడా ? తానే స్వతంత్రముగా లేచినాడా? తమతరఫున పనిచేయుటకు అర్హుడా? అనర్హుడా? నాయకుల మాయలకు వశ్యుడై, తన్నెన్నుకొనిన ప్రజల మంచి చెడ్డల ఆచోకి యిస్తాడా? లేక తనశక్తి సామర్థ్యములను వుపయోగించి నాయకుల స్వార్థపరములగు సలహాలకు లోనుగాక, తన్నెన్నుకొనిన ప్రజల శాంతిసౌఖ్యములను పెంపొందించి కాపాడుతాడా? ఇత్యాదులను గురించి విచారించవలసి యుంటుంది. విచారించక దుడుంగుమని గేలం వేస్తేరా, మీ వ్రేలితో మీ కన్నొడుచుకొనిన వారగుదురు. గతించినదానిని బట్టి యీదలి యథార్థమునున్నూ యిట్టి విమర్శయొక్క ఆవశ్యకతనున్నూ, యెవరి మట్టుకు వారికే విశదము కాగలదు.

నాయకున కుండవలసిన లక్షణములు .

కార్యచతురత, మర్యాద, శాంతము, నిబాషము, ఆత్మగౌరవము. తన వుద్యోగమునకు గల ప్రతిష్ఠకు

భంగము రాకుండ కాపాడుకొన గలుగుట కార్యచతురత తొలుత కొంచెము లోపించినను, తదితర సుగుణములున్న యెడల, క్రమక్రమముగా చతురత దానంతటదియే వరించును.

నిజలక్షణములు లేనివారల నెన్నుకొనబడుటవలన నాయకులకు ప్రజలకు కూడ యిబ్బందే.

అసమర్థులగువారలను మెంబర్లుగా నెన్నుకొనుటవలన నాయకునకు కార్యనిర్వహణ భారముతగ్గుటకుబదులు, మరింత హెచ్చగును. అసమర్థులగు మెంబర్లు, నాయకులకు, వేగుల వారివలెవుపయోగపడుదురు. కానిసలహాదారులవలె, సహాయ పడరు. తమ అసమర్థతవల్ల బోర్డుకార్యనిర్వహణము నందు జోక్యము కలిగించుకొనక, యిచ్చకపుమాటలతో కాలము వెళ్ళ బుచ్చుచుందురు. పరిపాలనకు సంబంధించిన ప్రతివిషయము లోను, 'నన్నుముట్టుకోకు నామాలకాకి' అన్నట్లుందురు. అంతటితోనైనను వూరుకొనక, వివిధప్రాంతములనుండి, చాడీ కోరుమాటలు, తంత్రకొట్టుతనములు, పరస్పరద్వేషములను రెచ్చగొట్టు సమాచారములు, అసూయను పురికొల్పు అభూత కల్పనలను, భద్రముగా మూటగట్టుకొనివచ్చి, పదిలముగా మూటవిప్పి నాయకుని చెవిలో కెక్కింతురు. ఇందువలన పార్టీలేర్పడి కక్షలు తీవ్రమై, నాయకుని తల బరువెక్కును. నాటినుండి, పరిపాలనా వ్యవహారము స్థభించి, ప్రజాసముదా

యమునకు కూడిరాని నష్టము ప్రాప్తించును. ఎంతటి వివేకముగల నాయకుడైనను, మెంబర్లనబడే వేగులవాండ్ల మాటలకు చెవియొగ్గక తప్పదు. చెప్పగా చెప్పగా, 'బ్రహ్మకైనా యెత్తురా? రెమ్మ తెగులు?' అన్నట్లు, నాయకుడుకూడ వశ్యుడగుట తప్పదు. అంతటినుంచి, బోర్డు పరిపాలనా కార్యరంగము నుండి మరలి, వ్యక్తిగతద్వేషములవైపునకు తన దృక్కులను మరల్చి, బుద్ధిపూర్వకముగా కాకపోయినను కార్యావసరముకొద్ది ప్రజాక్షేమమునకు వ్యతిరేకముగా ప్రవర్తింపవలసిన పరిస్థితు లేర్పడును. ఇవి సంగతి సందర్భములు.

కావున సహోదరులారా? నా యోగ్యతను గురించి తమరుపూర్తిగా విమర్శించండి. నేను అర్హుడనని తోచినచో మీ వోటు నాకు దయచేయండి. మీరు నాకు సంక్రమింపజేసిన అధికారమును, యెట్టి పరిస్థితులలోను మీ అనుమతిని ముందుగా పొందనిదే యేవిధముగాను వినియోగము చేయను. మీరు నన్నెన్నుకొనిన పిమ్మట, నా అసమర్థత వెల్లడియైనంత నే మీరు మాతరఫున మెంబరుగా నుండతగరు గాన, మీరు వదలుకోవలసినదని కోరేయెడల, వెంటనే నాకు మీరొసంగిన అధికారమును మీకు వదలివేయుచున్నాను. ఇదిచాల సున్నితమగు విషయముగాన, మాయమాటలకు మోసపోక మీ వోటు హక్కును సద్వినియోగము చేయ ప్రార్థించుచున్నాను.

తాడేపల్లిగూడెం,
ది 27-9-32.

ఇట్లు విధేయుడు,
యద్దనపూడి వెంకటరత్నం.

ఓం.

అ న్న లా రా!

# వెర్రిభ్రమలకు లోనై మోసపోకండే.

పాతచట్టము ననుసరించి, డిస్ట్రిక్టుబోర్డుకు తాలూకా బోర్డునుంచే మెంబర్లను పంపే ఆచారముండేది. ఇదిన్నీ గాక వెళ్ళిపొయ్యే డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటుకు, రాబొయ్యే తాలూకాబోర్డులకు కొంతమంది మెంబర్లను నామినేటు చేసే అధికారముకూడా వుండేది. ఇట్టి సందర్భములలో గడువు ముగిసి వెళ్ళిపొయ్యే జిల్లాబోర్డు ప్రెసిడెంటు, ఒక పలుకుబడి గల కులస్థుడనో లేక స్నేహితుడినో జేరదీసి, యేమి చెప్పే వాడంటే, నీకు, తాలూకాబోర్డు ప్రెసిడెంటుఅయ్యేసాధనము చెబుతాను అటు తర్వాతనీబోర్డులోనుంచి, యెన్నుకొనబడే డిస్ట్రిక్టుబోర్డు మెంబర్లచేత, నాకు జిల్లాబోర్డు అధ్యక్షపదవికి వోటు చేయిస్తావా? అని అడిగేవాడు. మిత్రుడేమనేవాడంటే యింతకంటేనా? అనేవాడు. సరే అంటే సరే అనుకుని, ఆ ప్రకారం యగ్రిమెంటు వ్రాసుకొనుటకు వీలులేదు. గనుక అమ్మకు మొగుడో, తల్లికి మొగుడో అనివట్టుపెట్టుకునేవాడు.

వెంటనే మిత్రుడేమి చేసేవాడంటే, నామినేటెడ్ మెంబరు పదవులకు తన చెప్పుచేతలలో యుండేవాళ్ళను, యే అయిదుగురినో ఆరుగురినో తయారుచేసి, జాపితా జిల్లాబోర్డు

ప్రెసిడెంటుగారికి అందజేసేవాడు. ప్రెసిడెంటుగారా పేర్లను గవర్నమెంటువారికి గెజెటులో ప్రచురింప బడుటకు పంపించేవారు. అంతటితో ఆ అంకము ముగిసేది.

అప్పటినుంచి, కాబోయ్యే తాలూకాబోర్డు ప్రెసిడెంటుగారికి పడికట్టురాళ్ళలాగ తన తరఫున ఆరువోట్లు కనుపించేవి. అంతటితో సరి పోతుందాయది. ప్రెసిడెంటు కావాలంటే, సరి ఆరువోట్లు కావాలి. వాటికొఱకు డబ్బున్నవాళ్ళను నిలవబెట్టితే తనమాట వింటారో వినరో అనే సందేహం. తెలివైన వాళ్ళను నిలవబెట్టితే, తన ఆశ లడుగంటుతాయేమో అనే భయం. దరిద్రులను నిలవబెట్టితే సన్నాసాడికిజుట్టు కాడినుంచి మెరువు తేవాలేమో అనే సంకోచం. అదుపాజ్ఞలలో వుండే వాళ్ళను నిలువబెట్టితే చేతిచమురు వదలుతుందేమో అనేదడ. ఈ విధముగా మనస్సు పరిపరి విధముల పరితపించేది.

తుదకు అటూ, యిటూ గాకుండా, డబ్బున్నవాళ్లనూ, తెలివిగలవాళ్ళనూ, వదలివేసి, బొత్తిగాదరిద్రులు, పూర్తిగా భాగ్యవంతులూగాక, బొటాబొటీగావున్న వాళ్ళను కొందఱిని, యెందుకైనా మంచిదే అని అదుపాజ్ఞలలో నుండే వాళ్ళను కొందఱిని, మెజారిటీకి అవసరమగు నంతమందిని నిలువబెట్టేవాడు.

అదృష్టవంతుడైనా తాను నిల్వబెట్టిన వారందరూ గెలిచేవారు, నిష్పేచీగా ప్రెసిడెంటు అయ్యేవాడు. ఎటూ

మోటీవచ్చినా? అడిగారూ అయ్యగారి తిప్పలు. అబ్జక్షన్ పిటీషనులా? ఇంజక్షను ఆర్డరులా? దావాలా? ప్లీడరు సలహాలా? ఇత్యాదు లెన్నెన్నో తమాషాలు రకరకాలు బయలుదేరేవి.

చచ్చీ చెడి చాయంగల విన్నపము లన్నట్లు తుదకు యేదో విధముగా గడిచి, గండం తప్పి, ప్రెసిడెంటయ్యే వాడు.

ఆ తేదీ మొదలు, ప్రెసిడెంటుగారికి వోటిచ్చిన వారూ, ఆయనకువోటిచ్చే యుద్దేశ్యముతో మెంబరవ బ్రియత్నించి, వోడిపోయినవారు తోబుట్టువులలాగున తగులుకునేవారు. ఓటిచ్చినమెంబర్లు పునిస్త్రీ తోబుట్టువులలాగున యేదో శుభకార్యములందు, పండుగపర్వములందు మాత్రమే ప్రత్యక్షమయ్యేవారు కాని, మెంబరుకు నిలువబెట్టబడి ఓడిపోయినవారు, వెధవ తోడబుట్టువులలాగున సర్వకాలసర్వావస్థలయందును, వెంటనంటి వేపుకు తినేవారు.

ప్రెసిడెంటుగారేమి చేస్తారు పాపము. పునిస్త్రీ తోబుట్టువుకు ప్రత్యక్షముగా కాకుండా ఏతల్లో, మేనత్తో పేరు చెప్పి ముట్ట చెప్పేవారు. వితంతు తోబుట్టునకు విధిలేక, ఆమె మొఖాన్నే, మనువర్తి క్రింద కొంత పారవేసేవాడు. అదుపాజ్ఞలలోనుండి మెంబర్లయినవాళ్ళు, తానేవాళ్లు, వాళ్ళే తాను గనుక, "పరస్త్రీ పుత్రి మాతుం చాయ" అనువట్లుండేది.

ఈ విధముగా ప్రెసిడెంటుకు వోటిచ్చిన మెంబర్లకు యే బావమరది పేరు పెట్టో, లేక అల్లుడన్నగారి పేరు పెట్టో కంట్రాక్టులు యిచ్చేవాడు. ఓడిపోయినవాడైతే, వాడి పేరుతోనే యిచ్చేవాడు. ఈరీతిగా ప్రజల సొమ్ము దుర్వినియోగమయ్యేది. అంతా వాళ్ళే గనుక, యెంతడబ్బుకు యేమి పని జరిగినది అడిగేవాళ్ళుండేవారుకారు. పైవాళ్ళు యెంతపరితాప పడితే యేమిలాభము.

ఈయన యీవిధముగా, ప్రజలసొమ్ము దుర్వినియోగం చేయడంలో అర్థం లేకపోలేదు. తన విజయమునకై పాటుపడిన వారికి కలిగిన నష్టం యేదోవిధముగా కూడదీయకపోతే తనతో కూడిరారు. తనకు వోటిచ్చుటకు మెంబరు కాదలచి ప్రయత్నించి, వోడిపోయినవారిని బొత్తిగా విసర్జించితే యాగీ చేయకమానరు. పార్టీలోనివాడు గనుక, ఆనుపానులు, గుట్టుమట్టులు పూర్తిగా తెలిసివుంటాయి. అట్టివాడుయాగీచేయడం మొదలుపెట్టాడంటే కోతి కల్లు తాగినట్లే. కాబట్టి వారిని ముఖ్యముగా చేపట్టి వుంచాలి. అందువల్ల ప్రెసిడెంటు తానెంత పరాకాష్టగా నుండదలచినను, వితంతు తోబుట్టువు లన బరగు రెండవరకప్పువారిని గురించి బోర్డు సొమ్ము దుర్వినియోగం చేయక తప్పదు.

ప్రెసిడెంటుకు కంట్రాక్టర్లతో యిట్టి సంబంధమువున్నదని చూచాయగా తెలిసియుంటుంది గనుక, పాపము! యింజ

సీరింగు డిపార్టుమెంటువారేమి చేయగలరు ? వాళ్ళ ప్రాణాలు కూడ ప్రెసిడెంటుగారి చేతుల్లోనే వుంటాయి గనుక, లోలోపల అంతరాత్మ బాధించుచున్నను, గుటకలు మ్రింగి వూరుకొనకతప్పదు. అదిన్నిగాక, కంట్రాక్టరు బిల్లులలో యింజనీయరుగారు పని సరిగా జరుగలేదని కోతలు మొదలుపెట్టితే, ప్రెసిడెంటే ఆబిల్లు స్వయముగా పట్టుకుపోతూయుంటే, యింజనీరేమి చేస్తాడు ? ఓవర్‌సీయరేమిచేస్తాడు ?

నూతన చట్టములో యిట్టి సదుపాయము లన్నియు నూడబెరుకబడినవి. పూర్వకాలపు పప్పులుడకవు. జోగీ జోగీ రాసుకుంటే బూడిదరాలుతుం దన్నట్లుంటుంది. కాబొయ్యే ప్రెసిడెంటు నంటిపెట్టుకొని ఆయనకు ఓటు యిచ్చే ఉద్దేశ్యముతో మెంబరీకొరకు ప్రయత్నించి గెల్చినా, ఓడినా, కంట్రాక్టుల మూలముగా నష్టము కూడదీసుకొనవచ్చుననే భ్రమలకు లోనుగాకండి. ప్రభుత్వమువారి కీతంతు అంతా తెలిసే, లోకలుబోర్డుల నాటకములోనుండి యీఅంకము నెత్తివేశారు. కావున సహోదరులారా ! భద్రము.

తాడేపల్లిగూడెం,
ది 28-9-1932.

ఇట్లు విధేయుడు,
యద్దనపూడి వెంకటరత్నం.

శ్రీ.

# పార్టీ అంటే వేళాకోళం కాదు.

1. ఉప్పు, చింతపండు, ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు కలిపి నూరితే పచ్చడవుతుంది. జిహ్వకు రుచిగా వుంటుంది. అన్న హితవు పుట్టుతుంది. ఈసంగతిఅందరు యెరుగుదురు. అల్లాగాక, ఉప్పు, చింతపండు ఒకపార్టీ. వుల్లిపాయలు, పచ్చిమిరపకాయలు ఒకపార్టీ. మీకు యేదికావాలో అది తీసుకోండీ అంటే, యెల్లావుంటుందో, ఏదోఒకపార్టీకి ఓటు చేయమంటే, అల్లావుంటుంది. ఔనా? కాదా?

2. ఒకనికి దేహములో జబ్బుగావున్నది. వైద్యుడు నారింజకాయలు తినమన్నాడు. నారింజకాయలు తినమంటే, తొక్కతో గింజలుసహా, నమలి మింగమనా? దాని అర్థము? కాదు గనుక అతడేమి చేస్తూయున్నాడంటే, ముందుగా తొక్కవొలిచి చెయ్యి తుడుచుకొని, యీనెలు లాగివేసి తొనలువిప్పి, గింజలు దీసివేసి, నోటిలో వేసుకొని, చప్పరించి రసము మింగి, పిప్పి ఉమ్మేస్తున్నాడు. ఇదిన్నీగాక ఒకడు తన భార్యను, కౌగలించుకున్న శరీరముతోనే కూతురును కౌగలించుకొన్నాడు. భార్యను కౌగలించుకొన్నప్పుడు ఉద్దేశ్యము వేరు. కుమార్తెను కౌగలించుకొన్నప్పటి ఉద్దేశ్యము వేరై వుంటుంది. కనుక అల్లాగే కులపువాడికి వోటు యిచ్చేటప్పుడు

కూడా, గుణమే తీసుకోవాలిగాని, మనిషిని కాదు. ఔనా ? కాదా ?

3. ఒంట్లో బుట్టిన రోగమే మనిషిని లొంగదీస్తుంది. తనకు బుట్టిన కొడుకే, చెప్పినట్టు వినక, కన్నతండ్రిని రచ్చ కెక్కించుచున్నాడు. వొంట్లోపుట్టిన గోగానికి అడవిలో పుట్టిన వేరుముక్క మందై, రోగము నెదుర్కొని, వ్యాధిని, నివారణ చేస్తుయున్నది. పరాయి కులము వాడైనప్పటికి, న్యాయాధిపతి, తండ్రికొడుకుల మధ్య తగవుతీర్చి, వారికి పొత్తుకుదుర్చుచున్నాడు. దీనిని బట్టి అహితము కోరువాడు కులపోడైనప్పటికి, శతృవగుచున్నాడు. హితము కోరేవాడు పరాయివాడైనను, మితృడగుచున్నాడు ఔనా? కాదా?

4. బెల్లం, మంచినీళ్ళు, మిరియాలపొడి కలిపితే పానకము అవుతుంది. అల్లాచేయక, దేనికది, ఒకదాని తరువాత మఱియొకటి నమిలి మ్రింగితే, పానకమువలె రుచికరముగా వుంటుందా? వుండదు. అల్లాగే, అందరు యేకీభవించి, తమ వోటు హక్కును వినియోగిస్తే, సత్ఫలమిస్తుంది గాని, యెవరి మట్టుకు వారు, యెవరిష్టం వచ్చినట్టు వారు, యేదోయొక పార్టీకి వోటిస్తామంటే, తమ వోటు హక్కునకు వుండే ప్రతిఫలం ముట్టదు. ఔనంటారా? కాదంటారా ?

5. కాడి, మోకు ఒకపార్టీ; నాగలి, కర్రి వొకపార్టీ రెండూ కలిపితే దున్నటానికి వీలుగాయుంటుంది గాని, దేని

కది, వేర్వేరుగా, యెంత భద్రముగా యుంచితే యేమి లాభము? దుక్కి యెల్లావస్తుంది. దుక్కి దున్ననిదే, పంట యెల్లా పండుతుంది. కనుక పార్టీల పద్ధతి, అనర్థము. ఔనా? కాదా?

6. బండిచక్రములు వొకపార్టీ, యెడ్లూ తోలేవాడు ఒకపార్టీ; ఇద్దరూ కలిస్తే ప్రయాణీకులు నడవక్కరలేకుండా ఒకచోటునుండి మరియొకచోటునకు అనాయాసముగా పోవచ్చును గాని, ఎవరుపట్టుకువారు, మాపార్టీ మాపార్టీ, అని భీష్మిస్తే, యిబ్బంది పడవలసినవారు ప్రయాణీకులు, ఔనా? కాదా ?

ఇట్టివన్నీ మీరు మనస్సునందుంచుకొని, ఒక్కపర్యాయము మీరు న్యాయబుద్ధితో మీస్వేచ్ఛను వినియోగించి, అర్హుడనితోచినవానికి, యేపార్టీకి చెందని స్వతంత్రునికి మీ వోటునిస్తిరా పార్టీలు వాటంతటవే మాయమై పోతాయి. అంతటినుంచి, పార్టీపద్ధతులమీద బయలుదేరితే టిక్కెట్టుమారదని బోధపడుతుంది. తదాది యోగ్యతలు రంగంలోనికి వస్తాయి. దానితో తేలుతుంది రంగు. ఇంక చూచావూ తమాషా ?

ఈ సందర్భములో, బ్రిటిషుసామ్రాజ్యమునకు ప్రధాన మంత్రియగు **రామ్సే మేగ్డనాల్డు దొరగారు,** పార్టీ పద్ధతిని గురించి వ్రాసిన లేఖయొకటి 30—9—1932

తేదీగల అనగా నిన్నటి తేదీగల ఆంధ్రపత్రికలో ప్రకటింప బడినది. దానిని యిచ్చట పొందుపఱచుచున్నాను. పార్టీ అంటే యేమిటో లోగడ, నేను కరపత్రముల మూలముగా ప్రచు రించినదానికిని, వీరు వచించినదానికిని, వ్యత్యాస మేమిటో చదువరు లూహింతురుగాక!

"12 నెలల క్రితము మేము జాతీయ ప్రభుత్వమును ప్రారంభించినపుడు పార్టీ అభిమానముతో పనిచేయకూడదని నిశ్చయించితిమి. ఇప్పటికిని ఆ నిశ్చయముతోనే, మేము పని జేయదలచితిమి. ప్రపంచ ఆర్థిక మహాసభ జరుగవలెను. యుద్ధఋణముల విషయమును, నష్టపరిహార సమస్యయును పరిష్కారము కావలెను. అంతవఱకు ముగియదు గాన అప్పటి వఱకు మే మిటువలెనే (పార్టీ అభిమానము లేకుండనే) పని చేయుచుందుము. ఇపుడు జాతీయప్రభుత్వముండవలెను గాని పార్టీ ప్రభుత్వ ముండకూడదని 12 నెలల క్రితం వోటర్లకు మే మెరిగించిన రీతినే, యిపుడుకూడ తెలుపుచున్నాము. పార్టీ ప్రభుత్వ మేర్పడినచో, ప్రపంచమున జాతీయతయొక్క పలుకు బడి తగ్గిపోవును. అందువలన నిపుడు ప్రపంచాభివృద్ధికి పని చేయుచున్న యుద్యమముల కన్నిటికిని గూడ నష్టము వచ్చు నని థామసుశాంకేగార్ల పక్షమునను, లేబరుసభ్యులపక్షము నను మేగ్డనాల్డుగారు ప్రకటించిరి.

ప్రస్తుతము మన బోర్డుల స్థితికూడ యిట్లేయున్నది. మనము పరిష్కరింపవలసిన విషయములుకూడ చాలవఱకు అట్టివే. కావున పార్టీల పద్ధతి అనర్థము. బోర్డు వ్యవహారములలో లాభనష్టములను గుఱించి విమర్శించే విషయాలలో అభిప్రాయ భేదములు కలిగి పార్టీ పడితే పడవచ్చునుగాని, ఒకడుంటే రెండోవాడుండకూడదనిగాని, ఒక తెగవారిని రెండవ తెగవారు అణగత్రొక్కవలెననే అహంభావముతోగాని, లేక ఒక కులమువారు రెండవ కులమువారిని తల యెత్తనీయగూడదనిగాని, పార్టీలుపడి ద్వేషము పెంచడం, నీచలక్షణం. దేశారిష్టం. జాతివినాశన సూచకం. చెప్పవలసినదని పరమేశ్వరుడు ప్రేరేపించినదానిని మీకు వినుపిస్తూయున్నాను. అటు పిమ్మట మీ చిత్తము. నా ప్రాప్తము.

తాడేపల్లిగూడెం,
ది 1-10-1932.

ఇట్లు విధేయుడు,
యద్దనపూడి వెంకటరత్నం.

---

# ఇదీ లోక నాయకత్వమే?

గంగిరెడ్లవాడు ఆంబోతును తెస్తాడు. ముడ్డి యెండగట్టి, ముక్కుతాళ్ళు వేసి, ములుకర్రతో పోట్లుపొడిచి లొంగ తీస్తాడు. అంతటినుంచి యింటింటికి తిరిగి రంగురంగుల పాతగుడ్డలను తిరిపెమెత్తి తెస్తాడు. కష్టపడి వాటిని బొంతగాకుట్టి

దానిపైన కప్పుతాడు. కొమ్ములకు కంచుగొడిసెలు తగిలించి, కుచ్చులు కట్టుతాడు. ఆటనేర్పి, కాలికి వెండితోడా వేస్తాడు. వెంకన్నా, అయ్యగారిని ధర్మమహుగు అని కొఅడా యే మనిషివైపుకు చూపిస్తాడో ఆమనిషివద్దకు వెళ్లేటట్లు మప్పు తాడు. అంతటితో ఆంబోతు గంగిరెద్దవుతుంది. నాటనుండి నలుగురిని పోగుజేసి, ఒకటికి డోలు, యింకొకడికి సన్నాయి, మరొకడికి తాళం యిస్తాడు. తాను కొఅడా పట్టుకుంటాడు. ఈవిధంగా మేళంతాళం తయారుచేసి, యింటింటికి తిరిపెము నకు బయలుదేరుతాడు. తానుమాత్రము కొఅడాను, ఆదమరచి యుండడు. ఆదమరచియుంటే యేమి జరుగుతుందో వానికే తెలుసును. వీడిదీ ఒక నాయకత్వమే ?

కోతులనాడించే భాగోతపువాడు, తోపులో పొంచి పొంచియుండి తల్లికడుపునంటిపెట్టుకొనియున్న కోతిపిల్లలను, పట్టుకుని తీసుకువస్తాడు. నిజముగా ప్రేమయున్న వానివలె పాలు, పళ్లు బెట్టి పెంచుతాడు. నడుముకు తాడుగట్టి తాను అనుమతించిన ఆవరణలో తిరుగుటకు మాత్రమే వీలున్నంత తాడుంచి, ఒకగుంజకు కట్టివేస్తాడు. గుంజకు కొంచెం యెత్తు మీద ఒక చిన్నపెట్టె నమర్చి, దానిలో అది పడుకోటానికి సదుపాయం కల్పించుతాడు. కొంచెం చనువైనతర్వాత ఆట నేర్పుటకు ప్రయత్నిస్తాడు. చెప్పినట్టు వినక పెంకితనం చేస్తే మేతవెయ్యడు. దా ని తో తా ను ం డే స్థి తి కి వ్చి వి డు

చేసే ఆదరణకును గల సంబంధమేమిటో బోధపడుతుంది. పెంచినవాడాడించి నట్లాడకపోతే తింటానికి మేత వెయ్యడని గ్రహిస్తుంది. అందువల్ల క్రమముగా చెప్పుచేతలలోనికి వస్తుంది. ఎప్పుడైతే చెప్పుచేతలలోనికి వస్తుందో అప్పుడు దానికొక లాగూ, చొక్కా, టోపీ కుట్టిస్తాడు. తానే వాటిని స్వయముగా తొడుగుతాడుకూడాను. ముడ్డిక్రిందకొక పీటకూడా చేయిస్తాడు. మొగాని నామాలు దిద్దుతాడు. ఈసరంజాముతో దీనిని వెంటబెట్టుకొని, ఇంటింటికి బయలుదేరుతాడు. వీడిదీ ఒక నాయకత్వమే ?

సంసారం పరిత్యజించినట్లగుపించుతాడు. దండకమండల కాషాయాంబరములు ధరిస్తాడు. మౌనంతాలుస్తాడు. దిట్టంగా మర్రిపాలు పూసి, వెంట్రుకలు జడలు కట్టిస్తాడు. వొడలు నిండా బూడిదె పూస్తాడు. మోకుతాడు మొలకు చుట్టుతాడు. వేలెడువెడల్పు పీలిక కౌపీనంగా ధరిస్తాడు. అపర శివునిలాగున కనుపిస్తాడు. యేచెట్టుక్రిందనో ఆసనం బనాయిస్తాడు. ధూనీ (కొఱకంచులు) తగిలిస్తాడు. పొగరాజటం మొదలుపెట్టుతుంది. వెంటనే తాటిబెల్లాని, బొంతయీగలు ముసరటం మొదలు పెట్టినట్లు, శిష్యులుజేరటం మొదలుపెట్టుతారు. అంతటినుంచి, గంజాయి నలిపే వాడొకడు. అందులో గింజలేరేవాడొకడు. నీళ్ళు తెచ్చేవాడొకడు. గుడ్డతడిపేవాడొకడు. చిలుముబాగుచేసేవాడొకడు. కొబ్బరిపీచు చుట్టగా

చుట్టికాల్చిఅందిచ్చే వాడొకడు. ఈవిధముగా శిష్యకోటి సమావేశం అవుతారు. ఏడిదీ ఒక నాయకత్వమే?

పశువులకు జీడిపాగేయిస్తాడు. పరిశుభ్రముగా తోమి కడిగిస్తాడు. నునునునలాడతూాయున్నట్లగుపించుటకు వొంటి నిండా చమురు పూయిస్తాడు. పాలు పితుకకుండా పొదుగులు పూనగట్టిస్తాడు. వాటి వాటి ఖామందులచేత సంతకు తోలిపిస్తాడు. అమ్మేవాళ్ళతో నామాటలేనిదే బేరం యివ్వవద్దంటాడు. కొనేవాళ్ళతో నాకు నచ్చితేగాని బేరంకొనవద్దంటాడు. ఉభయులక్షేమము కోరినవానివలె నటిస్తాడు. తనకుముట్టే బ్రోకరేజినిబట్టి బేరాలు పోచాయింపు చేస్తూయుంటాడు. ఈవిధంగా యెడాపెడాకూడా జేబులో వేసుకుంటాడు. ఏడిదీ ఒకనాయకత్వమే ?

పగటి వేషాలు వేద్దామని పదిమందిని పోగుచేస్తాడు. అందులో ఒకడిని భామవేషం కోసం యేరుతాడు. దగ్గిరవుండి సర్వాంగక్షౌరంచేయిస్తాడు. మూతిమీద మీసాలు తీయించి గవ్వమెరుగెట్టిస్తాడు. పడిదికి కోకలు తెస్తాడు. అద్దెకు నగలు తెస్తాడు. ఒకడిని మొఖానికి అర్దళం వేయమంటాడు. ఇంకొకడిని అద్దంపట్టుకొని యెదురుగుండా నుంచోమంటాడు. రంగు కలిసిందో లేదో చూడమంటా డింకొకడిని. ఒకడిని బొట్టుపెట్టమంటాడు. ఇంకొకడిని పాపిడ దిద్దమంటాడు. ఇంకా ఆడ

వాండ్లకుండవలసిన లక్షణాల నన్నిటిని వాడినే సర్దుకోనుంటాడు. కాళ్ళకుగజ్జెలుకట్టించి, మేళతాళాలతో, తోడుపాటగాళ్ళతో యితరహాంగుదార్లతో యెక్కేగుమ్మం దిగేగుమ్మం ఇదీ ఒక నాయకత్వమే ?

ఇట్టివి వేనకువేలున్నాయి. ఇప్పటి లోకల్ బోర్డుల యెలక్షనుల కొఱకు ప్రత్యేకము కొందరునాయకులు తయారగుట సహజము. అట్టివారి మాటలను విని మోసపోక, మీ మీ గ్రామములకు మీరే నాయకత్వము వహించి, మీ మీ బుద్ధికుశలతల నుపయోగించి, ప్రజాహితము ననుసరించియే మీవోటు హక్కును వినియోగించండిగాని, మావోడిల్లాచెప్పాడుగనుక మేమల్లాగే నడుస్తామని, మీకుగల స్వాతంత్ర్యము పోగొట్టుకోకండి. ఇక్కాలమందు ముష్పాతికవంతు నాయకుల తత్వములు యిట్టి మోస్తరువిగా మీకు కనుపించుటలేదా ? ఇంకా విప్పి చెప్పాలా ?

నిజమగు నాయకుల లక్షణములు.

తనకున్న సర్వస్వమున్నూ ప్రజలకై వినియోగించాలి. తనదంటూయేమీ యుండకూడదు. తనబాధ యెల్లావుంటుందో పరుల బాధలుకూడ అల్లావుంటాయి అని యోచించాలి. దయా సత్య శౌచములు నిత్యవిధులై యుండాలి. పాపభీతిగలిగి

దైవమొకడున్నాడని నమ్మి, అహింసావ్రతమవలంభించి, భూత దయ గలిగి మెలగాలి.

ఇట్టివారి కీర్తిచంద్రికలు దశదిశలను విజ్జిమ్ముతాయి. అనురాగయుతులగు అనుచరుల సంఖ్య దినదినప్రవర్ధమాన మవుతుంది.

కపటనాయకుల లక్షణాలు.

వీరి కీయోగ్యత హంగుదారులవలన కలుగుతుంది. అంతేకాని వారి కది నిజలక్షణమై యుండదు. అసాధారణ ప్రజ్ఞా విశేషములు గలిగి, తేజోమూర్తులై, అసమాన ధైర్య సాహసములతో విరాజిల్లుచు, స్వామి కార్యనిర్వహణమునందు నిరుపమాన దీక్షా పరతంత్రతయే తను జీవితమునకు పరమావధి యని భావించి, ఎంతటి చిక్కు వ్యాపారముల నైనను సునాయాసముగా విప్పి, కార్యసాఫల్యము నొందించుకొని, రాగల అనుచరులగు హంగుదార్ల కార్య చతురతయే. ఇట్టి నాయకులకు కొంతకాలమువఱకుపట్టినదల్లా బంగారవు, ముట్టినదల్లా ముత్యము అవటం మొదలుపెట్టుతుంది. కొంతకాలానికి యిదంతా తనమహత్యమే అనుకుంటాడు. అట్టి గర్వమావహించడంతోనే కండ్లు పొఱలు కప్పుతాయి. అదివఱకు అనుచరులగు హంగుదార్లను బుజ్జగించే అలవాటుపోయి, శాసించడం మొదలుపెట్టుతాడు. దానితో హంగుదార్లకు విశ్వాసం

క్షీణించి, సంఖ్య పల్చబడుతుంది. అంతటితో నాయకుడు అధఃపతితమునకు మార్గ మేర్పరుచుకుంటాడన్న మాట.

అనుచరులు లేని నాయకత్వ మెట్లుండును?

ఇల్లూ వాకలి వూడ్చుకొని, తీరుబడిగావున్నప్పుడు, చాకింటబట్ట, మడతవిప్పి కట్టుకొని, తల దువ్వి, కొప్పు పెట్టుకొని చాపపరుచుకొని, కూర్చొని, మూడేండ్లక్రితం చని పోయిన ముసలి మొగుడుకోసం మనసుపడి యేడుస్తూయుంటే యెట్లుంటుందో, యే బాపతు అనుచరులుగాని, విశ్వాసపాత్రులుగాని, హంగుదార్లుగాని లేని నాయకుని ముక్తాయింపులలో సమరసత్వం అట్లుంటుంది.

కాబట్టి, సహోదరులారా? నిజనాయకు లెవరో కన్పెట్టండి. కపటనాయకుల మాటలకు మోసపోకండి. నిజముగు నాయకున కుండవలసిన లక్షణములుంటే అనుచరులు వారంతటవారే వెంటాడిస్తారు. బెల్లము కోసముచీమలు పోగవుట లేదా? అనుచరుల కోసం పాకులాడే నాయకులలో ముప్పాతికవంతు హంగుదార్ల పోగ త్తలవల్ల బయల్పడువారే కాని, వారియందు నాయకున కుండవలసిన నిజలక్షణములుండుట చేతకాదు. వీరినాయకత్వమును సార్థకము చేసుకొనుటకు, చేయు యేర్పాటులన్నియు, పిల్లి యెలుకల కొఱకును తోడేలు మేకపిల్లల కొఱకును, ఎలుగుబంటి చీమల పుట్టల కొఱకును, చేయు ప్రయత్నములవంటి వే యైయుండును.

తప్పులను మన్నించి, ఇందలి సారమును గ్రహించండి. న్యాయం దయచేయండి.

తాడేపల్లిగూడెం, } ఇట్లు విధేయుడు,
ది 4-10-1932. } యద్దనపూడి వెంకటరత్నం.

---

## ఉన్నదున్నట్లుచెపుతాను

## నమ్మితే నమ్మండి. నమ్మకపోతే నమ్మకపోండి.

అమాయకులును, నిష్కల్మషహృదయులును అగు పల్లెటి గ్రామవాసులగు సోదరులారా? నేనీబోర్డుమెంబర్లను గురించి వూహించిన వూహాలు, చేసిన ప్రయత్నాలు చెపుతాను వినండి.

అటు తర్వాత మీాయిష్టము వచ్చినట్లుచెయ్యండి.

### రకరకాల వూహాలు.

**1.** కొంతమంది నాయకులకు బోర్డుకు మెంబర్లను తయారు చేస్తారనే ప్రతిష్ఠ వుండేది. అట్టివారివద్దకు వెళ్ళి నన్నొక మెంబరుగా చేయవలసినదని ఆశ్రయిద్దామా? అను కునేవాడను. కాని తీరానోరువిడిచి అడిగితే, మెంబరైన

తర్వాత వారు చెప్పినట్లు చేతులెత్తేతత్వము నాది కాదనిన్నీ ఆమాటలంటే అప్పుడేనేను అవాకులు, చవాకులు మొఖానే అంటానేమో అనే సందేహాముచేతను, గడుసుదనంగా, మెల్లాబడితే అల్లాగ అర్థమయ్యేటట్లుండేలాగున, నీకుఛాన్సు వుంటుందా? అంటే, నేను చెప్పవలసియుండే జవాబేమిటో తోచక వెనకకు తగ్గేవాడను.

2. పోనీ పార్టీ నియమములకు లోబడే పద్ధతిని, క్యాండిడేటులను యేరి, నిలువబెట్టుటకై కొందఱు నాయకులు ఏర్పడ్డారని విని, నన్నుకూడా ఒక ఫిర్కాకు నిలువబెట్టమని ప్రాధేయపడి అడిగితే యేమైన పని జరుగుతుందేమో, అను కునేవాడను. కాని ఆవిధముగా కక్కూర్తిపడి తీరా అడిగితే, కులతత్వాలలోపడి కొట్టుకు చస్తూయుంటే, మంచిచెడ్డలూ, తెలివితేటలూ, యీ రోజులలో యెవరు చూస్తారు వెంకట రత్నంగారూ? అంటేయేమి చెయ్యాలి? అనుకునేవాడను.

3. స్వశక్తిపై నాధారపడి ప్రయత్నిద్దామా అంటే? బంగారపు పళ్ళాలికైనా గోడచేరుపు వుండకపోతే నిలువబడ దంటారు కదా? అట్లే, యెంతటి ప్రజ్ఞావిశేషము లుంటేనేమి? హాంగుదార్లు ముక్తాయించేవాళ్ళు లేకపోతే మేళం రక్తికట్ట దంటారు. మనకట్టి వేవియు కనుపించటంలేదే? కాబట్టి ప్రజ్ఞా విశేషాలు, తెలివితేటలు యెంతవరకు సహాయపడతాయి అనే ఆలోచనలో పడేది మనస్సు.

4. ద్రవ్యబలముచేత కొంతవరకు కోట్టుకు రావచ్చు నంటారుకదా? దీనిమూలముగా, ప్రయత్నిద్దామనే వుబలాటం పుట్టేది. అవుసరమగునంత డబ్బు, దగ్గిర నిలువ లేకపోయినప్పటికి, అప్పో సప్పోచేసి, తీరా తెస్తామనుకో? డబ్బిచ్చి కొనుకొన్న ప్రేమ, పర్యవసానం తేలిందాక వుంటుందా? అనే సందేహం పుట్టేది. డబ్బిచ్చి వుంచుకొన్న వెలయాండ్రను వేనకువేలను ప్రతినిత్యము మనము చూస్తున్నామే; మనవద్ద డబ్బు కాజేసేవరకు, మనలను ప్రేమించినట్లు నటించడం, తనకు కావలసినపనికోసం ఇంకొకడిని చేరదీయడం, ప్రేమించినట్లగుపించిన వానివల్ల రాబట్టినసొమ్ము జేరదీసినవాని పోషణకై వెచ్చించడం, జరుగుతూయున్నదికదా? అట్లే మనవద్ద డబ్బుతీసికొని, వోటింకొకడికి వేస్తే మనము చేయవలసిన దేమిటి? మనము డబ్బాశపెట్టి అన్యాయపద్ధతికి అవలంబించవలసినదని ప్రాకులాడుతూ యుంటే వారు మనతీట వదల్చి, న్యాయపద్ధతి అవలంబిస్తారని యందుకనుకొనకూడదు? ఇట్టి సందర్భములు తటస్థిస్తే సొమ్మూపోయి దిమ్మూపడుతుంది గదా? వుభయభ్రష్ఠత్వమైన తర్వాత, మనకు గత్యంతర మేమిటాయని మనస్సు పరిపరి విధాల పోయేది.

5. పోనీ ఎదరపార్టీవారి లోటుపాట్లు అవకతవకలు, వున్నవీ లేనివీ ప్రోగుచేసి వాటిని గోరంతలు కొండంతలుజేసి యాగీచేసి, అందువల్ల ఆపార్టీమీద అసూయత పుట్టించి దానిని

అవకాశముగాతీసుకొనినాయందుఅనురక్తిపుట్టించుకుందామా అనుకున్నను అట్టిది నీచలక్షణం గాన్పించడంవల్ల ఆపద్ధతిని అవలంబించుటకూ మనస్కరించేదికాదు.

## దైవబలం.

ఇవన్నీ యిల్లా వున్నాయిగదా ! యేమిటి సాధనం అని ఆలోచించగా, ఆలోచించగా, వినువాడు తెలిసికొనచాలనివాడై నప్పుడుగదా! చెప్పేవాడెట్టినీతి నుద్బోధించినను నిరుపయోగముగా కన్పించుట, అట్టి లోటు మీాయందు కనుపించలేదుసరి కదా? దీనికితోడు ఈశ్వర విలాసములు స్ఫురణకు వచ్చినవి కూడాను. అవి యెవ్వియన ప్రదక్షిణ, స్పర్శధ్యానములు. ప్రదక్షిణంఅంటేతిరగటం. పిల్లలకు పాలిచ్చి పెంచుటకు, మనుష్య, పశుజాతుల కున్నట్లు చేపలకు స్తనములుండవు. అయినప్పటికి తల్లి వాటిచుట్టూ తిరిగి తనపిల్లలను పోషించుకొనుచున్నది. గజేంద్రుడు తన్ను ఆపదనుండి తప్పించుమని శ్రీమహావిష్ణువును ప్రార్థించినట్లు, ద్రౌపది వలువలిమ్మని శ్రీకృష్ణుని ప్రార్థించినట్లు, తాంబేలు తన పిల్లల నెదురుగా నుంచుకొని వాటిని పోషించి పెంచమని పరమేశ్వరుని ప్రార్థించి, తన సంకల్పము నీడేర్చుకొనుచున్నది. తాకుటవలన పక్షిజాతులు తమపిల్లలను పోషించుకొనుచున్నవి. ఇందులకు నిదర్శన మెట్లనగా కోడి గుడ్లను పెట్టునే కాని, వాటిలోనున్న పిల్లలకు ఆహారమును

తెచ్చిపెట్టుటలేదు. కాని ప్రతి నిత్యము కొంచెముసేపు వాటి పైన కూర్చుని తాకుచుండును. ఇట్లు స్పర్శమాత్రముచేత గ్రుడ్లలోని పిల్లలు వృద్ధిపొంది, అందుండి బయటికి వచ్చి, తల్లి వెంటనంటి తిరిగి వాటి ఆహారము నవే యేరుకొనితినుచున్నవి. ఇత్యాదులనేక నిదర్శనములున్నాయి. కావున ఏకార్యమైనను మంచి ఉద్దేశ్యముతో మొదలుపెట్టినయెడల పిపీలికాదిబ్రహ్మ పర్యంతముగల జీవరాసుల కాధారభూతుడైన పరమేశ్వరుడు సత్ఫలమిచ్చునట్లు చేయుననే నమ్మకము కుదిరినది. ఈధైర్య ముతో స్వార్థపరులును, నామమాత్రులును అగు నాయకు లపై నాధారపడక, సర్వసమర్థుడగు లోకనాయకునిపై నాధార పడి, యీపదవికి అభ్యర్థింప సాహసించితిని, ఇదితప్పా ?

## విఘాతాలు.

ఈ విధముగా బయల్వెడలినప్పటికి విఘాతాలు వెంటా డింపకపోలేదు. ఈపదవియం దెట్టిసారము లేదంటారే ? దీని కొఱకింత పాకులాట యెందుకని కొందఱనసాగిరి. మేకమెడ క్రింద చళ్ళు నిరుపయోగముగానున్నట్లు కనుపించుతాయి. బాలుడు బొటనవ్రేలిని నోటియం దుంచుకొని త్రావునట్టి చొంగయందు పాలుండవని కూడ అంద రెరుంగుదురు. అట్లే యీపదవులుకూడ నిరుపయోగములైనవాటివలె కనుపించు తాయి. కాని మేకమెడక్రింద చన్నులుంచుటయందును చంటి

పిల్లలు నోటియందు వ్రేలుపెట్టుకొని కుడుచుకొనవలెననే భ్రమ పుట్టించుటయందును అర్థము లేకపోలేదు. ఇట్లవి నిరుపయోగములని పైకి కనుపించినప్పటికి, వీటియం దేదోరహస్యము యిమిడియుండక మానదని బుద్ధిమంతు లూహించక మానరు. అంతరార్థమును మీరు తెలుసుకోవాలంటే మీవోటుహక్కు అను తేజస్సును నాలో ప్రవేశింపజేసిననేగాని దానినిగ్రహింప గల శక్తి నాకు రాదు. అట్టిశక్తి మీ రిస్తిరా నిముషములో విప్పిచెప్పుతాను. చూచుకోండి తమాషా ?

నీ చ ల క్ష ణ ము.

చెరువునిండా నిర్మలమగు నీరున్నప్పటికి, కాకి కుండలో నీటినే యపేక్షించుట దాని స్వభావము. వెండికంచములో పంచభక్ష్యపరమాన్నములుంచినను దానిని తిననొల్లక, ఎంగిలాకులలో మెతుకు లేరుకొని తినబోతుంది కుక్క. ఈవిధముగా కొందరు నీచులు తమకు సహజములగు నీచపుబుద్ధులను విడనాడలేక సన్మార్గుల సంకల్పములకు తమ కుతంత్రములచే వికల్పములను కల్పింప ప్రయత్నింతురు. కావున సదయహృదయులగు సహోదరులారా ! అట్టివాటిని నమ్మి మీరు మోసపోకండి.

తు ది పి న్న ప ము.

నేనొక పార్టీకి చెందినవాడననినీ, పటోద్దేశముతో యిదియొక వేషమువేసి నన్నొక పార్టీవారు ప్రత్యేకముగా

తయారుచేసినారనిన్నీ, ఒకవదంతి బయలుదేరదీసి అక్కడక్కడ అక్రమప్రచారములు చేయుచున్నట్లు తెలిసినది. మేమిద్దర మన్న దమ్ముల మనుమాట సత్యమే. నాకనిష్ఠసోదరుడగు చి॥ సుబ్బా రావు రాజుగారిపార్టీ యనుమాట నిజమే. నాకు అందరితోను మైత్రి కలదనుమాట యథార్థమే. అంతమాత్రముచేత నేనొక పార్టీనియమములకు బద్ధుడనై యున్నాననియును నన్నొకరు ప్రత్యేక మొక కార్యావసరముకొరకు లేవదీసి యీ వేషం వేయించినారనే అపవాదయం దెంతమాత్రము సత్యములేదని ప్రమాణంపైన చెప్పగలను. అన్నదమ్ములైనను తత్వములు వేరైయుండవా ? వాలిసుగ్రీవులు, బలరామకృష్ణుల చరిత్రలే యిందుకు తార్కాణికములు. ఇంతకంటె విపులముగా వివ రించు టనవసరమని భావించి యింతటితో విరమించుచున్నాను.

## ప్రార్థన.

కాబట్టి మీ రీవిషయమును లెస్సగా ఆలోచించి, స్వార్థ పరులగు పార్టీనాయకుల ప్రోద్బలములకు లోనుగాక, మీ చిత్తవృత్తి ననుసరించి మీవోటుహక్కు వినియోగించి పల్లెటి గ్రామములవారైనను వివేకమును పూర్తిగా వినియోగించినా రనే ఖ్యాతిని నిలుపుకొందురని విశ్వసించుచున్నాను.

తాడేపల్లిగూడెం,
ది 4—10—1932.

ఇట్లు విధేయుడు,
యద్దనపూడి వెంకటరత్నం.

# కడసారిమనవి.

## చట్టముయొక్క ఉద్దేశ్యము.

అమాయకులగు సోదరులారా!

లోకల్ బోర్డులు ప్రజాసౌకర్యము నిమిత్తం ప్రభుత్వము వారివలన నెలకొల్పబడినవి. ఈ సంగతి లోకల్ బోర్డులచట్టము నందలి ప్రియాంబిల్ అనగా: ఉపోద్ఘాతమునందు స్పష్టముగా గాన నగును. ఎట్లనగా:—

"రాజధానిలోని వివిధజిల్లాలలోను ప్రజాసౌకర్యము నిమిత్తం రాజబాటలను నిర్మించుట, నిర్మింపబడిన వాటిని మరమ్మతు చేయించుట, సంరక్షించి కాపాడుట, ప్రజలలో విద్యనువ్యాప్తినొందించుట, ఆరోగ్యమునకును ప్రజాభ్యుదయ మునకు అనుకూలించు అన్నిబాపతుల యితర పనులను సక్రమముగా నిర్వహించుటకు కొన్ని నిబంధన లవసరమై యున్నవి కాబట్టి యీ క్రింది సూత్రములను నిర్మించి వాటిని చట్టరూపకముగా శాసించుట అగత్యమైనదని వ్యక్తీకరింప బడినది" కాబట్టి స్థానికసంస్థల అసలు ఉద్దేశ్యమేమిటో యిందు మూలమున గ్రహింపనగును.

## సభ్యుల చిత్తవృత్తులు.

ఇప్పుడట్లుగాక యీ సంస్థలు ప్రజల శాంతిసౌఖ్యముల అభివృద్ధికి అవసరమగు కార్య నిర్వహణమున కుప

యోగపడక, వ్యక్తిగతములగు పార్టీలపోషణకై వినియోగ పడుచున్నవనుట కనేకనిదర్శనము లున్నవి. వీటియందు ప్రవేశించే సభ్యులలో చాలమంది తమ్మెన్నుకొనిన ప్రజల క్షేమాభ్యుదయములకు తాము బాధ్యులమని భావింపక, తమపార్టీని సమర్థించుటయే తమ ముఖ్యకర్తవ్యమనే మూర్ఖత్వమును వహించుచున్నారు. తమ్ము ప్రజలెన్నుకొనుట వల్లనే తమకీ బాధ్యత సంక్రమించినదని లేశమైనను తలపోయక, తమ ప్రజ్ఞావిశేషములు ప్రజాసముదాయముచేత నాకర్షింపబడుటవలన తమకీ సామ్రాజ్యపదవి లభించినదనే అహంభావముతో మైమరచి ప్రవర్తించుచున్నారు. ఇక యిట్టి సభ్యులచేత నెన్నుకొనబడిన అధ్యక్షు డన్ననో, ప్రజాప్రతినిధులగు సభ్యుల తీర్మానముల నమలులో బెట్టుటకై తానుయెన్నుకొనబడినట్లు భావించి, తదనుగుణ్యముగా వ్యవహరించుటకు బదులు, తాను ప్రతినిధులగు సభ్యులను మభ్యబెట్టి, ప్రజలను శాసించి, తన చిత్తవృత్తి ననుసరించి నిరంకుశత్వముతో కార్యనిర్వహణమునకు గడంగుటకు సర్వాధికారములు గలిగియున్నానని విర్రవీగుచున్నాడు. పరిస్థితు లీవిధముగా పరిణమించుచున్నవి గనుకనే నిర్మలాశయములతో నెలకొల్పబడిన, యీ సంస్థలు కలుషపూరితములుగా కన్పట్టుచున్నవి.

## ఎన్నికలవిధానము.

వోట్లను వేయించుకొనుటలోగూడ సవ్యమగు మార్గము లవలంబింపబడుటలేదు. నిజసందర్భములను అమాయకులగు ప్రజాసముదాయమునకు అర్థమయ్యేటట్లు బోధించి తమ

యందువారికి సహజమగు ప్రేమను పుట్టించుకొనుటకుబదులు, భ్రమపెట్టి, మభ్యపరచి, మోసముచేసి, భయ భ్రాంతుల గావించి, తమ సంకల్పమును సిద్ధింపజేసికొనుట పరిపాటైనది. ఇట్టి అక్రమవిధానము లవలంబించి తాత్కాలిక విజయమును బడయ గలిగినను, ఉద్యోగాంతమందు తమ నిజరూపము బయల్పడి, అదివరకుండే ఆ వంత పలుకుబడియు కోల్పోవక తప్పకున్నది. యథార్థమును మరుగుపరచి, ప్రజలను నమ్మించి మోసపుచ్చుటకు వెరువని సభ్యులకు నిలయములగు చున్నవి. గనుకనే, ప్రజలకు లోకల్‌బోర్డుల యందలి విశ్వాసము నానాటికి సన్నగిలుచున్నది ఇందాశ్చర్య మేమున్నది ?

## పార్టీలు.

ఎన్నికల ప్రచారములో పార్టీలుండటం సహజమే. కాని యిట్టివిధానము స్వాతంత్ర్య మనుభవించుచున్న దేశములకు మాత్రమే లాభకారిగా పరిణమించును. అస్వాధీనమై యుండు దేశములలో కూడ పార్టీల పద్ధతిపై ప్రచారము సలుపుట రివాజే. అట్టి వేమైన అవసరమైన యడల రాజకీయ పార్టీ లుండుట న్యాయము కాని, వ్యక్తిగతములగు నాయకుల పేర్లతో పార్టీలుండుట ప్రపంచమం దేదేశమందును గానరాదు.

ప్రత్యేక మీాజిల్లాలో యీాపార్టీలపద్ధతి చిత్రవిచిత్ర గతులుగా నడుచుచున్నది. వీటిలో ముఖ్యమగునవి: (1) పెద్దిరాజుగారి పార్టీ, (2) వెంకటాద్రియయ్యనాయుడుగారి పార్టీ, (3) తిమ్మరాజుగారి పార్టీ, (4) ఇంద్రయ్యగారి పార్టీ, ఇవి

గాక యింకా పిల్లపార్టీలనేకము లున్నట్లు వినవచ్చు చున్నవి గాని అవి అంతగా ప్రాముఖ్యత నందినవి కావు. గాన విపులముగా వివరింపబసి లేదు. ఈపార్టీల నాయకుల తత్వమేమిటో యిప్పటికి యెవరివల్లను యెక్కడను వివరింపబడి యుండలేదు. మాపార్టీకి వోటిమ్మని అడిగినప్పుడు మీపార్టీ తత్వమేమిటని అడిగిన వోటరొక్కడైనను బహుశా వుండడని నానమ్మకము. ఏపార్టీవారైనా ప్రభుత్వమువారి అనుజ్ఞలకు లోబడి, చట్ట నిర్మాణసభవారిచేత నిర్మింపబడిన చట్టములోని సూత్రముల నతిక్రమించకుండా వ్యవహరించవలసినవారేకదా? ఇట్టి సందర్భములలో ఒకపార్టీ నంటిపెట్టుకొని యుంటే ప్రత్యేక సౌకర్యములు కలుగజేస్తామని నాయకులు చెప్పడం. ప్రత్యేక సౌకర్యములు కావలెనని వోటర్లు కోరడము అశాస్త్రీయమేకదా! అనే వాడొకడూ కనుపింపడే. ఉన్నది వున్నట్లు వివరింపక, తాము అనుసరింపవలసిన మార్గములను సక్రమపద్ధతుల ననుసరించి అవలంబింపక పామరులగు ప్రజలను భ్రమపెట్టి, భయపెట్టి, మభ్యపెట్టి, యెంతకాల మీ దొడ్డిత్రోవలను, దిడ్డికంతలద్వారా బయట పడగలరు? గారడివాడు వట్టిచేయిని చూపించి, లక్కదొండకాయను తెప్పించునట్లు నటించు టెందుకో చూడవచ్చినవారు గ్రహించుటలేదా? ఏపార్టీవారు పారబోసినను ఒక కుండలోని నీరే అని వోటర్లు సునాయాసముగా గుర్తింపగల కాలము యిప్పుడు గాకపోయినను మరొకప్పుడైనను రాకమానదు. అప్పుడైనా యీ నాయకుల నిజరూపములు బయటపడవా?

నూతులు తవ్విస్తాము. చెరువులు బాగుచేయిస్తాము స్కూలు బిల్డింగులు నెలకొల్పుతాము. పాఠశాలలు పెట్టిస్తాము. బోరింగులు తీయిస్తాము అనే రకరకాల భ్రమల గొల్పుట కూడ తరుచైనది. ఇట్టి భ్రమలన్నియు నిరుపయోగములే. ఒక్కొక్కప్పుడు ప్రమాదహేతువులు కూడాను. ఎట్లనగా, 'అప్పచ్చిపెడతాను-బడికి పోయి రా, నాయనా' అని తల్లి తనయుని బుజ్జగించి బడికి వెడలనడిపిన పిమ్మట, పిల్లవాడు పాఠశాలకు పోతాడు. కాని పాఠము రాకపోతే పంతులుకొట్టకమానడు. ఈసంగతి తెలిసి, యింటికి వెళ్ళిన తర్వాత, 'అమ్మా! అప్పచ్చేది' అని అడిగితే, 'పాఠము అప్పగించడానికి అప్పచ్చెల్లావస్తుంది నాయనా' అని అనక మానదు. పాఠము రాకపోతే పంతులుపెట్టేహింసకు, అప్పచ్చి భ్రమ అడ్డముగాదు—కాబట్టి నూతులు, పంపులు భ్రమ నిరుపయోగము. అవసరము తీరిన తర్వాత తిరిగి దానిని బాగుచేయించేవారగుపింపరు. వ్యతిరేకపార్టీవారు రావడం తటస్థిస్తే చూచారూ తమాషా? -ఉన్నదానినే ఊడబెరికించడానికి ప్రయత్నిస్తారు. కార్యావసరమునుబట్టి శక్తికిమించిన పనులు చేయించుకొన్నప్పటికి, తరువాత దానిని భరించడమనేది సామాన్యసంసారి యేనుగను యింట్లో కట్టుకొన్నట్లుంటుంది. ఇట్టి సందర్భములు ప్రమాదజనితములుకూడాను. ఇటువంటి సాధకబాధకము లనేకములున్నవి. స్థలసంకుచితముచేత వివరించలేదు.

# సంఘాభిమానము.

ప్రతి సంఘమునకును వంశక్రమానుతమగు ప్రతిష్ఠ యేదో కొంతవుండకమానదు. యెవరి సంఘమునకు వుండే గౌరవమర్యాదలు వారికి వుండనే వున్నవి. లేని గౌరవము, నూతనముగా తెచ్చుకోవాలనే ఉద్దేశముతో పాటుపడుట కూడ న్యాయమే. అట్టివారి ప్రయత్నములకు అభ్యంతర పెట్టుటకూడ ఒకవిధముగా న్యాయము కాకపోతే కాకపో వచ్చును గాని, చిరకాలమునుండి ప్రసిద్ధికెక్కిన సంఘముల వారు, యిట్టి సంఘాభిమానవ్యామోహమునకు భ్రమపడి వశ్యులగుట, తమకేగాక, తమ్మాశ్రయించిన యితరకులముల వారికికూడ చేటొనరించినవారగుదురనుట తథ్యము. లోకల్ బోర్డులో మెంబరీపదవి నధిష్ఠించినంతమాత్రముచేత నూతన మర్యాదలు ఆపదవి నందినవానికి వస్తే రావచ్చునేమో కాని, సంఘమున కంతకు సంక్రమించి, సంఘములో యేవైనా లోటుపాట్లుంటే, అవన్ని మాటువడుతాయనుకోవడమువట్టికల్ల.

ఇదియునుగాక, లోకల్‌బోర్డులకు సెస్సురూపకముగాను యితర బాపతుల మూలముగాను, ఆదాయము, నిచ్చువారిలో అన్నికులములవారును వుందురు. ఇట్టి వివిధకులస్థులకు సంబంధించినవసరులవలన వచ్చు ఆదాయమే లోకల్ బోర్డులకు మూలధనము. ఇట్టిదానిని వెచ్చించుటలో సలహానిచ్చుట కవసరమగు సభ్యుల నెన్నుకొనుటలో గుణము, విద్య, అనుభవ జ్ఞానము, సామర్థ్యము నిష్పాక్షికబుద్ధి యిత్యాదు లాదర్శకము

ఉగా నుండవలెను. గాని సంఘాభిమానావేశమునకు తావీయ కూడదు. గర్భాధానపు పెండ్లికొడుకు, నపుంసకుడైతే, ఎన్ని పాలు తాగించి, యెన్ని మంగళహారతులిచ్చి లోపలికి పంపితే యేమి ఫలితము? లోపలికివెళ్ళినతర్వాత వచ్చేమంగళహారతుల వలన కలిగే పరితాపమును, బయటివారిచ్చిన మంగళహారతులుగాని, అశీర్వాదములుగాని శాంతింపజేయలేవు. కావున సంఘాభిమానావేశములకు తావిచ్చుట చాల విపత్కరము.

## బోర్డుల మూలధనము.

వర్షపుచినుకులు కనపడీ కనపడనట్లు భూమిమీదపడి, అవే తూములవెంట, బోదెలవెంబడిని, యేరులైపారి, ఒక చెరువులో చేరును. అట్టి నీటిని, భద్రపరచి, ఒకతూరద్వారా, దానిఆయకట్టు పొలమునకు వంతుల వెంబడిని పంచిపెట్టుటకై ఒకనికి పెత్తనమివ్వబడుచున్నది. నీటినితూరవెంట వంతుల వారిని పంచిపెట్టుటకై నియోజింపబడువాడు నీరు వదలుటలో అక్రమపద్ధతులవలంబించుట ఆక్షేపణీయమగునో కాదో మీరెరుంగనిదికాదు. ఇదేవిధముగా లోకల్‌బోర్డుల ఆదాయము ప్రజలవద్దనుండి దమ్మిడి, దమ్మిడి చొప్పున వసూలు చేయబడిన సొమ్ము. దీనిని సక్రమముగా నిష్పక్షపాతబుద్ధితో పంచిపెట్టక, పార్టీపద్ధతులను మనస్సునందుంచుకొని అయిన వానికి ఆకులోను, కానివానికి కంచములోను బెట్టజూచుట అన్యాయము కాదని యెవ్వరనగలరు? సూర్యచంద్రాదులు

చండాలుని యింటియందు తక్కువుగాను బ్రాహ్మణునియింటి యందు యెక్కువగాను తమ తేజస్సును ప్రసరింప జేయుట లేదు.

నే నెందు కపేక్షించానంటే?

ఇందును గురించిన తెలివి తేటలనుమీహృదయములలో జొప్పించుటకు, గుణగ్రహణపారీణులగు మీరు, రాజహంసలు పాలనుండి నీళ్ళను వేరుచేసి, పాలను మాత్రమే గ్రోలినట్లు, విషయమును విమర్శించి గుణమును గ్రహించమని నాప్రార్థన. అశాశ్వతమగు తుచ్ఛసుఖమునకు భ్రమపడి వశ్యులుగాక, చిర స్థాయియు, శాశ్వతానందదాయియునగు విజ్ఞానమును తనివి దీర గ్రోలుడు. మీహృదయములు మాలిన్యరహితములగు అద్ద ములవంటివి. కాన విజ్ఞానమునుసునాయాసముగా ప్రతిబింబింప జేయగలననే విశ్వాసముతో మీయండ జేర సాహసించితిని. మీహృదయము లింకను వ్యసనములకు లోబడియుండ లేదు. గాన, మీమానసికములను వికసింపజేయగల అదను యింకను దాటలేదని నాదృఢనమ్మకము. ఈవిశ్వాసముతో, మీసాదర సానుభూతులనంద సాహసించితిని. కావున నాయందు మీరు సంపూర్ణవిశ్వాసముంచి మీతరఫున జిల్లాబోర్డు సభ్యత్వమునకు నన్నెన్నుకొన ప్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుడు,

యద్దనపూడి వెంకటరత్నం.

ఏలూరు
పట్టాభిరామా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.